# ధర్మసందేహాలు

## (సంశయాత్మ వినశ్యతి)

**శ్రీశ్రీశ్రీ శ్రీధర స్వామీజీ**

**శ్రీ శ్రీధర గురునిలయం**

శ్రీ ముక్కమల మహాక్షేత్రము, పెరవలి మండలం,
పశ్చిమగోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్-**534 330**
ఫోన్స్ : 08819-278393, 278893
సెల్ : 98485 13939, 97059 29318
**Website: www.shridharswamyji.com**

# అంకితం



నాకు స్వప్నసాక్షాత్కార ఫలంగా విగ్రహరూపంలో లభించి, అఖండ శ్రీవిద్యను ప్రసాదించి, గురుస్థానంలో నిలిపిన మా గురుదేవత శ్రీశ్రీశ్రీ బాలనాగత్రిపుర సుందరీ అమ్మవారికి “అమ్మతో నా అనుభవాలు” గ్రంథాన్ని అంకితమిస్తున్నాను.

శ్రీ ముక్కమల మహాక్షేత్ర వైభవంలో విశేష సహాయ సహకారాలందించిన మా ప్రియశిష్యులు శ్రీ కున్నత్ ప్రదీప్ మెనొన్ దంపతులకు ఈ శుభసందర్భంగా ప్రత్యేకమైన శుభాశీస్సులను అందచేస్తున్నాను.

# ధర్మసందేహాలు

## సంశయాత్మ వినశ్యతి

ఏ పనైనా సంశయంతో చేసినట్లయితే ఫలితం శూన్యమవుతుంది. అందుచేత పూజా, స్తోత్ర, జప, ధ్యాన, లయ, ఉపాసనాదులలో మనకుండేటటువంటి సంశయాలను నివృత్తి చేసుకుంటూ, ముందుకు పోతుంటే అత్యద్భుత ఫలితాలు అతి శీఘ్రంగా పొందవచ్చు. అమ్మ ఆరాధన విషయంలో అనేకమైన అనుమానాలు, సందేహాలు, సంశయాలు, కలిగి అత్యద్భుత ఫలితాలను ప్రసాదించే ఆదిపరాశక్తి అయిన అమ్మ అనుగ్రహానికి, ఆశీర్వచనానికి, ఆదరణకి దూరమౌతున్నాం. అమ్మపై అపోహలను తొలగించి, అమ్మ సన్నిధికి చేర్చే ఈ చిన్ని ప్రయత్నమే ధర్మసందేహాలు.

**1. త్రింశత్ కోటి దేవతలలో ఎవరు ప్రధానమైనవారు?**

**జ:** పంచాయతన దేవతలుగా గణపతి, సూర్యుడు, విష్ణువు, శివుడు, అంబిక చెప్పబడినారు. అయితే వీరిలో అంబికయే ప్రధానమైనటువంటి దేవత. ఏవిధంగా అంటే బ్రహ్మస్థానంలో చేసినటువంటి పాపాన్ని విష్ణుస్థానంలోనూ, విష్ణుస్థానంలో చేసినటువంటి పాపాన్ని శివస్థానంలోనూ, శివస్థానంలో చేసినటుంటి పాపాన్ని గురుస్థానంలోనూ, గురుస్థానంలో చేసిన పాపాన్ని దేవీస్థానంలోనూ పోగొట్టుకోవచ్చు. దేవీస్థానంలో చేసినటువంటి పాపాన్ని ఏవిధంగానైనప్పటికీ కూడా పోగొట్టుకోలేము. అదేవిధంగా లలితాసహస్రనామ స్తోత్ర ఫలశ్రుతిని బట్టి కవులు రచించిన వేయి కవిత్వాలకంటే ఒక విష్ణునామం గొప్పది. వేయి విష్ణునామాలకంటే ఒక శివనామం గొప్పది. వేయి శివనామాల కంటే ఒక్క దేవీనామం గొప్పది

అని చెప్పబడింది. అదేవిధంగా ఆదిశక్తి బ్రహ్మ నాలుకపై సరస్వతీరూపంలో కొలువై వుండకపోతే బ్రహ్మకు విలువలేదు. శ్రీమహావిష్ణువు హృదయకమలంలో లక్ష్మీరూపంలో కొలువై వుండకపోతే విష్ణువుకు విలువలేదు. పరమేశ్వరుడి అర్ధశరీరంలో గౌరీరూపంలో కొలువై వుండకపోతే పరమేశ్వరుడికి విలువలేదు. త్రిమూర్తులు ముగ్గురూ కూడా త్రిమాతలవల్లే సృష్టి, స్థితి, లయాదులు నిర్వహించగలుగుతున్నారు. త్రిమూర్తులే కాదు త్రింశత్‌కోటి దేవతలు కూడా ఆదిశక్తి అనుగ్రహ విశేషంచేతనే వారివారి ధర్మాలు నిర్వర్తించగలుగుతున్నారు. అందుచేతనే **"యాదేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః"** అని స్తుతించబడింది. బ్రహ్మ సృష్టించగలిగే శక్తిని కలిగివున్నాడు. విష్ణువు పోషించగలిగే శక్తిని కలిగివున్నాడు. పరమేశ్వరుడు లయం చేయగలిగే శక్తిని కలిగివున్నాడు. ఏమి కలిగివున్నారు 'శక్తిని' కలిగివున్నారు. అందుచేత అమ్మ ఆదిశక్తియై జగత్తుకు మూలమైనది.

ఇదేవిధంగా మంత్రరాజం ఏది అనగా గాయత్రీ మహామంత్రం. యంత్రరాజం ఏదనగా శ్రీచక్రమహాయంత్రం, తంత్రరాజం ఏదనగా శ్రీవిద్య. వేయిమాటలేల విద్యకావాలంటే ఎవరిని ఆరాధించాలి సరస్వతిని. ఐశ్వర్యం కావాలంటే లక్ష్మిని, సౌభాగ్యం కావాలంటే గౌరీదేవిని ఆరాధించి తీరాల్సిందే. దీనినిబట్టి అమ్మ ఆరాధనే ప్రధానం.

**2. ఇంతటి మహాశక్తి అనుగ్రహాన్ని ఏవిధంగా పొందగలము?**

**జ:** అమ్మ భక్తిప్రియ. భక్తివశ్య. భక్తిగమ్య. నిర్మల, నిశ్చల, అచంచల భక్తికి ప్రీతినొందుతుంది. అటువంటి భక్తికే వశమౌతుంది. అటువంటి భక్తిమార్గం ద్వారా మాత్రమే అమ్మను చేరుకోగలము. దేవీభాగవతంలో

శ్రీమహావిష్ణువు మణిద్వీప చింతామణి గృహంలో అమ్మవారి సందర్శనం చేసుకొని, అమ్మా! నీ నివాసస్థానమేది? మణిద్వీపమా? కైలాసమా? వైకుంఠమా? సత్యలోకమా? స్వర్గలోకమా? సిద్ధపీఠాలా? ఋష్యాశ్రమాలా? నదీతీరాలా? అరణ్యమధ్యాలా? సముద్రతీరాలా? శిఖరాగ్రరాలా? అని ప్రశ్నించినపుడు ఆ మహాశక్తి చిరునవ్వులు చిందిస్తూ, మహావిష్ణువూ "నిర్మల, నిశ్చల, అచంచల భక్తి విశ్వాసాలు కలిగిన భక్తుని హృదయ కమలమే నా నివాసస్థానం" అని వక్కాణించింది. అదేవిధంగా భక్తునియొక్క ప్రాధాన్యతను వివరిస్తూ ఏ భక్తుడైతే నన్నే పూజిస్తూ, నన్నే స్తుతిస్తూ, నా నామాన్నే జపిస్తూ, నా రూపాన్నే ధ్యానిస్తూ, నా కొరకే తపిస్తూ, ఆ వచ్చిన ఫలాన్ని కూడా నాకే అర్పిస్తూ వుంటాడో ఆ భక్తునికి, నాకూ అభేదం. ఇంతటి ప్రాధాన్యత అమ్మ భక్తికి ఇచ్చింది. అందుచేత త్రింశత్‌కోటి దేవతలకే సాధ్యంకాని అమ్మ అనుగ్రహం, అమ్మ భక్తునికే సాధ్యమౌతుంది. అమ్మ భక్తునికి ఎంత శక్తి వుందంటే భగీరథుడు గంగమ్మను దివినుండి భువికి తెచ్చిన ప్రయత్నంలో ఉన్న సందర్భంలో భూలోకంలోని శ్రీకృష్ణుని గంగామాత స్వామీ! కలికల్మష నాశనిగా భగీరథుడు అవనిలో అవతరించమని ప్రార్థిస్తున్నాడు. ఎన్నో పాపకర్మలు చేసిన పాపులు వారియొక్క పాపాలను నాలో వదలివెళ్లినపుడు నేను పొందిన ఆ పాపఫలాన్ని నేను ఏవిధంగా ప్రక్షాళన చేసుకోవాలి అని ప్రశ్నించినపుడు శ్రీకృష్ణభగవానుడు ఒక్క దేవీ భక్తుడు నీలో స్నానమాచరించినా ఆ క్షణంవరకూ పొందిన పాపఫలాన్ని నీవు పోగొట్టుకుందువు. అంటే గంగ పాపాలను సైతం పోగొట్టి, గంగనే పునీతం చేసేటటువంటి మహత్తర శక్తి ఒక్క దేవీ భక్తునికి మాత్రమే ఉంటుంది.

## 3. శ్రీచక్రం విశిష్ఠత ఏమిటి?

**జ:** అమ్మవారియొక్క రేఖాస్వరూపమే శ్రీచక్రం. ఈ శ్రీచక్రంలో కామేశ్వరీ, కామేశ్వరులిరువురు కూడా మిధునరూపంలో కొలువైవున్నారు. ఈ శ్రీచక్రం యంత్రరాజంగా కొనియాడబడుతోంది. శ్రీచక్రం భూప్రస్థారంగా, మేరుప్రస్థారంగా, కైలాస ప్రస్థారంగా, అర్ధమేరువుగా, పద్మప్రస్థారంగా, మహాకామేశ్వరంగా మనకు దర్శనమిస్తూ వుంటుంది. రేఖారూపంలో వున్నటువంటి భూప్రస్థారం, మేరు పర్వతమువలె వుండునది మేరుప్రస్థారం, కైలాస శిఖరంవలె ఉండునది కైలాసప్రస్థారం, క్రుంగిన మేరు పర్వతంవలె ఉండునది అర్ధమేరు, పద్మాకారంలో ఉండునది పద్మప్రస్థారం, శివలింగంపై మహామేరువుగా కొలువైనది మహాకామేశ్వరంగా శ్రీచక్రంలో ప్రస్థార భేదములు.

ఈ శ్రీచక్రం ధారణయంత్రంగా, పూజన యంత్రంగా, స్థాపన యంత్రంగా మూడువిధాలుగా ఆరాధింపబడుతుంటుంది. ఒక్కసారి శ్రీచక్రోపాసకుడు నవావరణార్చన గావించి, ధారణ యంత్రంగా ధరించుటకు అనువుగా ప్రసాదించునది ధారణ యంత్రం. గృహంలో స్థాపించుకొని, ఆరాధించుటకు వీలుగా ఉండునది పూజన యంత్రం. దీనినే చరయంత్రంగా కూడా పిలుస్తారు. ఈ యంత్రాన్ని ఎప్పుడు ఆరాధిస్తే అప్పుడు ఫలితాన్ని అనుగ్రహిస్తూ వుంటుంది. అదేవిధంగా దేవాలయాల్లో మూలవిరాట్ క్రింద సశాస్త్రీయంగా ఆరాధించి, స్థాపించేటటువంటి యంత్రాన్ని స్థాపన యంత్రం అంటారు. ఈ యంత్రానికి బాలభోగము, మహానైవేద్యము, త్రికాలార్చన ఇత్యాది విశేష అర్చనలు, నైవేద్యాలు నిర్వహిస్తూ ఉండాలి. దీనినే స్థిరయంత్రమని కూడా పిలుస్తారు.

యంత్రశాస్త్రాన్ని బట్టి రాగిరేకుపై లిఖించి, ఆరాధించిన యంత్రంలో మంత్రశక్తి 10 సంవత్సరాలు వుంటుంది. వెండిరేకుపై లిఖించి ఆరాధించిన యంత్రంలో మంత్రశక్తి 25 సంవత్సరాలు వుంటుంది. బంగారు రేకుపై లిఖించి, ఆరాధించిన యంత్రంలో మంత్రశక్తి సూర్యచంద్రులు ఉన్నంతకాలమూ వుంటుంది. అందుచేత శక్తినిబట్టి యంత్రనిర్మాణ లోహాన్ని ఎంచుకోవాలి.

ఈవిధంగా శ్రీచక్రాన్ని ధరించినా, పూజామందిరంలో నిలిపి ఆరాధించినా, దేవాలయంలో ప్రతిష్ఠించినా జన, ధన, ఆకర్షణలు విశేషంగా కలుగుతాయి. అంతేకాకుండా ఇహంలో సుఖం, పరంలో మోక్షం లభిస్తుంది.

**4. అమ్మ ఉపాసన విశిష్ఠత ఏమిటి?**

**జ:** ఎక్కడ భోగం వుంటుందో అక్కడ మోక్షం వుండదు. ఎక్కడ మోక్షం వుంటుందో అక్కడ భోగం వుండదు. కానీ అమ్మను ఉపాసించేటటువంటి భక్తుని చేతిలో భోగమోక్షాలు రెండూ వుంటాయి. అంటే అమ్మ భక్తులు ఇహంలో అఖండైశ్వర్య భోగభాగ్యాలను అనుభవిస్తారు. అంత్యంలో మోక్షాన్ని పొందుతారు. ఇది కేవలం అమ్మ భక్తులకే అవకాశం.

**5. అమ్మ అనేక స్వరూపాలతో అలరారుతుంది. ఈ స్వరూపాల్లో ఏ స్వరూపాలు ప్రధానమైనటువంటివి?**

**జ:** **'వేదమాతా చ గాయత్రీ మంత్రమాతా తు త్రయక్షరి'** చతుర్వేదాలకు అధిష్ఠాత్రి గాయత్రి. సప్తకోటి మహావిద్యలకు అధిష్ఠాత్రి మూడు అక్షరాల మహామంత్రంగా కలిగినటువంటి బాలాత్రిపుర సుందరీ అమ్మవారు. అందుచేత ఈ ఇరువురినీ ఆరాధించు భక్తులకు అమ్మలందరి అనుగ్రహము

కలుగుతుంది. గాయత్రీ ఉపాసనవల్ల బ్రాహ్మణులకు బ్రహ్మత్వము, క్షత్రియులకు క్షాత్రము, వైశ్యులకు వైశ్యత్వము, శూద్రులకు శూద్రత్వము లభిస్తాయి. శ్రీబాలాత్రిపుర సుందరీ అమ్మవారియొక్క అనుగ్రహంవల్ల విద్య, ఐశ్వర్యము, సౌఖ్యము, ఈ మూడింటితోపాటు మోక్షము కూడా లభిస్తుంది. విద్య ఉండి ఐశ్వర్యము, సౌఖ్యము లేకపోయినా ప్రయోజనంలేదు. ఐశ్వర్యము ఉండి విద్యాసౌఖ్యాలు లేకపోయినా ప్రయోజనం లేదు. సౌఖ్యముండి విద్యా ఐశ్వర్యాదులు లేకపోయినా ప్రయోజనం లేదు. ఈ మూడూ ఉండి మోక్షం సిద్ధించకపోయినా ప్రయోజనంలేదు. శ్రీబాలాత్రిపుర సుందరీ ఉపాసకులకు అన్నీ లభిస్తాయి. అందుచేత అత్యద్భుతమైన ఈ మహాశక్తిని ప్రయత్నపూర్వకంగా ఆరాధించి, ఉపాసించి తరించాల్సిందే!

**6. గాయత్రీ మహామంత్రాన్ని ఏవిధంగా ఉపాసించాలి?**

**జ:** బ్రాహ్మణులకు ఏడవ సంవత్సరంలో ఉపనయన సంస్కారం చేసి, గాయత్రీ మహామంత్రాన్ని ఉపదేశించాలి. క్షత్రియులకు 9వ సంవత్సరంలో ఉపనయన సంస్కారం చేసి ఉపదేశించాలి. వైశ్యులకు 11వ సంవత్సరంలో ఉపనయనం సంస్కారం చేసి ఉపదేశించాలి. శూద్రులకు 13వ సంవత్సరంలో ఉపనయన సంస్కారం చేసి ఉపదేశించాలి. ద్విజులు మాత్రమే గాయత్రిని ఉపాసించాలి. ద్విజులు అనగా ద్వితీయ జన్మ ఎత్తినటువంటివారు. మాతాపితరులవల్ల జనియించిన ఈ జన్మ తొలిజన్మ. ఈ జన్మ సకలజీవకోటి కూడా ఎత్తుతున్నది. ఉపనయన సంస్కారం జరిగినటువంటివారు ఆధ్యాత్మిక జన్మ ఎత్తినటువంటివారు. దీనినే ద్వితీయ జన్మ అంటారు. ఈవిధంగా ఉపనయన సంస్కారం అయినటువంటివారిని ద్విజులు అంటారు. వీరు యజ్ఞోపవీతధారులై, యజ్ఞోపవీతాన్ని

పరమపవిత్రంగా కాపాడుకుంటూ, మూత్రవిసర్జన చేసేటప్పుడు కుడిచెవికి చుట్టుకుంటూ, మలవిసర్జన చేసేటప్పుడు ఎడమ చెవికి చుట్టుకుంటూ, క్షౌరము చేయించుకున్నప్పుడు, మైలగాలి తగిలినపుడు యజ్ఞోపవీతాన్ని మార్చుకుంటూ, శిఖను ధరించి ప్రాతః, మాధ్యాహ్నిక, సాయంసంధ్యలలో సంధ్యావందనాన్ని ఆచరిస్తూ, సంధ్యావందన సమయంలో గాయత్రీ మహామంత్రాన్ని 108 మార్లుగానీ, 500 మార్లుగానీ, వెయ్యిమార్లుగానీ జపించాలి. ఈ గాయత్రి మహామంత్రం జపించేముందు గాయత్రిమాత కొలువైనటువంటి 24 ముద్రలను ప్రదర్శించి, బ్రహ్మ, వసిష్ఠ, విశ్వామిత్ర శాపాలకు విమోచనము చెప్పుకొని, జపానంతరం అష్టముద్రలను ప్రదర్శించాలి. ప్రాతఃసంధ్యావందనము నక్షత్రములు ఉండగా ప్రారంభించి, సూర్యోదయపర్యంతము ముగించాలి. మాధ్యాహ్నిక సంధ్య సూర్యుడు నడినెత్తిపైకి రాకమునుపు ప్రారంభించి నడినెత్తిన దాటేంతవరకు సంధ్యను ఆచరించాలి. సాయంకాల సంధ్యావందనము సూర్యాస్తమయానికి పూర్వము ప్రారంభించి, నక్షత్రములు ఉదయించిన పిదప ముగించాలి. ఎట్టి పరిస్థితులలోనూ సంధ్యావందనాన్ని ఆచరించుట మానరాదు. బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు త్రిఫలగాయత్రిని మాత్రమే జపించాలి. యతులు, సన్న్యాసులు చతుష్పద గాయత్రిని, శతక్షరీ గాయత్రిని జపించాలి. గాయత్రీ మహామంత్రాన్ని ద్విజులు కానివారు జపించరాదు. గాయత్రీ మహామంత్రాన్ని కేవలం త్రిసంధ్యలలో మాత్రమే జపించాలి. ఈవిధంగా కాక కోటానుకోట్ల సార్లు గాయత్రీ మహామంత్రాన్ని జపించినా ఫలితం శూన్యమే అవుతుంది. స్త్రీలు, ఉపనయన సంస్కారం లేనివారు, గాయత్రీమాత అనుగ్రహం పొందుటకు అష్టక, అష్టోత్తర, సహస్రనామ

స్తోత్రాదులను పారాయణం చేసి, తత్ఫలితాన్ని పొందవచ్చు. 'స గాయత్ర్యా పరం మంత్రం' గాయత్రీ మంత్రాన్ని మించినటువంటి మంత్రము లేదన్న విషయాన్ని దృష్టిలో ఉంచుకొని, కోటిజన్మల పుణ్యమువల్ల మాత్రమే ఈ మహామంత్రోపదేశం అయిందన్న సత్యాన్ని అర్థం చేసుకొని, శ్రద్ధాభక్తులతో త్రిసంధ్యలలో గాయత్రీమహామంత్రాన్ని జపించి తరించాలి.

ఎటువంటి ఉపాసనలైనా, యజ్ఞయాగాదులైనా, వ్రతాలైనా, త్రికాల సంధ్యావందన అనంతరం మాత్రమే ఆచరించాలి. గాయత్రీ మంత్రానుష్ఠానం లేక చేసిన చతుర్వేద పారాయణగానీ, బాలామహామంత్రానుష్ఠానం చేయక చేసే మంత్రానుష్ఠానాలుగానీ నిష్ఫలమైపోతాయన్న సత్యాన్ని తెలుసుకోవాలి.

**7. శ్రీవిద్య విశిష్ఠత ఏమిటి?**

**జ:** అమ్మను ఆరాధించు విధివిధానాలను తెలియజేసేదే శ్రీవిద్య. మోక్షకారకమైన జన్మ కలిగినవారికి మాత్రమే శ్రీవిద్య సంక్రమిస్తుంది. సద్గురువును ఆశ్రయించి, శ్రీబాలాత్రిపురసుందరీ మహామంత్రాన్ని ఉపదేశం తీసికొని, 9 లక్షలు జపించి, 90వేల సార్లు పాయసము, ఆవునెయ్యిలతో హోమము చేసి, 9వేలు తర్పణం గావించి, 900 మార్జనము చేసి, 90 అభిషేకములు చేసి, 9 మంది బ్రాహ్మణులకు సంతర్పణ గావించిన బాలా మంత్రసిద్ధి చేకూరును. బాలాసిద్ధి క్రమాన్ని పూర్తి చేసుకున్నటువంటి సాధకుడు అదే గురువుద్వారా పంచదశాక్షరీ మహామంత్రాన్ని ఉపదేశమొంది, 15 లక్షలు జపించి, 1,50,000 సార్లు క్షీరాన్నము, ఆవునెయ్యితో హోమము చేసి, 15 వేలు తర్పణము గావించి, 1500 మార్జనము గావించి, 150 అభిషేకములు గావించి, 15 మంది

బ్రాహ్మణులకు సంతర్పణ చేసిన పంచదశాక్షరీ మహామంత్రము సిద్ధించును. అనంతరము మహాషోడశీ, మహామంత్రాన్ని అంగవిద్యలతో, రక్షణ విద్యలతో, గురుముఖతః ఉపదేశమొంది శ్రీవిద్యపూర్ణ దీక్షాపరుడుగా 16 లక్షల మార్లు మహాషోడశిని జపించి, 1,60,000 సార్లు త్రిమధువులతో, క్షీరాన్నముతో, ఆవునెయ్యితో హోమము గావించి, 16,000 తర్పణము గావించి, 1600 మార్జనము గావించి, 160 అభిషేకములు చేసి, 16 మంది బ్రాహ్మణులకు సంతర్పణ గావించిన మహాషోడశి మహామంత్రం సిద్ధిని ప్రసాదించును. అంగవిద్యలు, రక్షణ విద్యల మహామంత్రాలను లక్ష పర్యాయములు జపించి, తద్దశాంశ హవన, హవన దశాంశ తర్పణ, తర్పణ దశాంశ మార్జన, మార్జన దశాంశ అభిషేక, అభిషేక దశాంశ బ్రాహ్మణ భోజనాదులు గావించిన మంత్రములు సిద్ధించును.

ఈవిధంగా శ్రీవిద్యాపూర్ణదీక్షాపరుడైనటువంటి సాక్షాత్తు అమ్మ స్వరూపాన్ని పొంది, నిరంతరము త్రికాలసంధ్యావందన అనంతరం మహామంత్రములు జపిస్తూ, రాత్రికాలమందు శ్రీచక్రనవావరణార్చన, మంత్రోపాసన, సువాసినీ, కుమారీ, సామయిక, పంచపంచిక, పూజాదులను నిర్వహిస్తూ అఖండైశ్వర్య భోగభాగ్యములతో సకల భోగములను అనుభవిస్తూ అంత్యమందు అమ్మవారి నివాసస్థానమైనటువంటి మణిద్వీపానికి చేరి, అమ్మ సేవచేసే భాగ్యాన్ని అనుష్ఠాన తీవ్రతను బట్టి అమ్మ స్వరూపంలో ఐక్యమయ్యే భాగ్యాన్ని కూడా పొందుతాడు.

ఇటువంటి పూర్ణదీక్షాపరునకు ఎటువంటి మైలలు అంటవు. కేవలము మాతాపితరులు ఇరువురిలో ఎవరైనను మరణించినపుడు మాత్రమే 11

రోజులు మాత్రము మైల ఉంటుంది. మిగిలిన సమయాలలో ఎట్టిపరిస్థితులలోనూ ఉపాసనను విడువరాదు.

**8. శ్రీవిద్యోపాసనలో గురు ప్రాధాన్యత ఏమిటి?**

**జ:** "గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో పరమేశ్వరః గురుస్సాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీ గురవేనమః" సామాన్యర్థం తీసుకుంటే గురువే బ్రహ్మా, గురువే విష్ణువు, గురువే మహేశ్వరుడు, గురువే సాక్షాత్తూ పరబ్రహ్మము. అటువంటి గురువునకు నమస్కారము. గురువు ఏవిధంగా బ్రహ్మ అవుతున్నాడు. ఏవిధంగా విష్ణువు అవుతున్నాడు. ఏవిధంగా మహేశ్వరుడు అవుతున్నాడు. ఏవిధంగా సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపుడవుతున్నాడు. బ్రహ్మ కేవలము సృష్టించగలుగు చున్నాడు. విష్ణువు కేవలము పోషించగలుగుచున్నాడు. పరమేశ్వరుడు కేవలము లయింపజేయగలుగుతున్నాడు. కానీ ఈ గురుదేవుడు తనయొక్క శిష్యుని హృదయ కమలంలో భక్తిబీజములు నాటి, సృష్టికర్తయైన బ్రహ్మస్వరూపుడుగా భక్తిని వృద్ధిపరుస్తూ, స్థితికారకుడైన మహావిష్ణువుగా, పరాంబికలో లయింపచేస్తూ లయకారకుడైన పరమేశ్వరుడుగా, సృష్టి, స్థితి, లయాదులను తానొక్కడే నిర్వహిస్తూ సాక్షాత్తూ పరబ్రహ్మ స్వరూపుడుగా గురుదేవుడు అనుగ్రహిస్తున్నాడు. అటువంటి గురువు లభించడం దుర్లభం. మంత్రశాస్త్రంలో గురులక్షణం ఏవిధంగా ఉండాలో చెప్పబడింది. సకలశాస్త్ర పారంగతుడై, నిత్యకర్మానుష్ఠాన పరుడై, నిర్మలుడై, నిశ్చలుడై, సదాచారసంపన్నుడై, శాంతుడై, సకలశాస్త్రములను సదవగాహన చేసుకొనినవాడై, అనుభవైకజ్ఞాన సంపన్నుడై, గృహస్థాశ్రమ ధర్మాన్ని అవలంబిస్తున్నవాడు, తన శిష్యున్ని ఉద్ధరించగలిగే సామర్థ్యం కలిగినవాడు

సాక్షాత్తూ పరమేశ్వరుడిగా భావించి, ఆశ్రయించి, సేవించి, మంత్రోపదేశం స్వీకరించాలని మంత్రశాస్త్రం ప్రబోధిస్తున్నది. అటువంటి గురువు లభించుట కేవలం అమ్మ అనుగ్రహా ఆశీర్వచనములవల్ల మాత్రమే సాధ్యమౌతుంది.

గురువుద్వారా ఉపదేశమొందిన మహామంత్రాలు, గురువు ఎంతవరకు జపించాడో ఆ తదుపరి సంఖ్యనుండి శిష్యునికి లెక్కలోకి వస్తుంది. అందుచేత మహామంత్రాన్ని గురువుద్వారా ఉపదేశం పొందాలని తెలుస్తుంది. పై లక్షణాలు కలిగిన గురువు అనుగ్రహిస్తే సకలదేవతలు అనుగ్రహించినట్లే. సకలదేవతలు ఆగ్రహిస్తే ఒక్క గురువు రక్షిస్తాడు. ఒక్క గురువు ఆగ్రహిస్తే సకలదేవతలు ఏకమైనా రక్షించలేరు. అంతట శక్తి గురువుకు కలదు. కావున అటువంటి సద్గురువును ఆశ్రయించాలి. అనుసరించాలి. ఆరాధించాలి. పూజించాలి. స్తుతించాలి. గురుమంత్రాన్ని జపించాలి. గురురూపాన్ని ధ్యానించాలి. తన సర్వస్వాన్ని గురువుకే అర్పించాలి. గురువును ఆశ్రయించాలంటే ఆశ్రమాలకు వెళ్లి కూర్చోవాలని కాదు. గురువు ఏ దైవాన్ని అయితే ఆశ్రయించాడో, ఆ దైవాన్ని ఆశ్రయించాలి. గురువును అనుసరించడమంటే కారులో ఆయన వెనకాల ఫాలో అవడంకాదు. ఆయన ఏ సత్యవస్తువుని అనుసరిస్తున్నాడో ఆ సత్యవస్తువుని అనుసరించాలి. గురువును ఆరాధించాలి, పూజించాలి అంటే నిలువెత్తు ఫోటోలు హాల్లో పెట్టి పూజించడం కాదు. గురువు ఏ దైవాన్నయితే ఆరాధించే సమర్థుడైనాడో ఆ దైవాన్ని ఆరాధించి, ఆశ్రయించాలి. గురువును స్తుతించాలంటే ఆయనపైన అష్టకాలు, అష్టోత్తరాలు వ్రాసి స్తుతించడం కాదు. ఆయన ఏ దైవాన్నయితే స్తుతిస్తున్నాడో ఆ దైవాన్ని స్తుతించాలి.

గురునామాన్ని జపించాలి అంటే ఆ గురువుగారి పేరు జపించడంకాదు. గురువు ఉపదేశించిన మహామంత్రాన్ని జపించాలని అర్థం. గురురూపాన్నే ధ్యానించాలంటే గురువుగారినే ధ్యానించమని కాదు. గురువు బోధించిన జ్ఞానాన్నే ఆచరించాలి. ఈ సత్యాన్ని ప్రతి ఒక్కరూ తెలుసుకున్నట్లయితే అద్భుత ఫలితాలు సాధిస్తారు. ప్రతి ఒక్కరూ తెలుసుకోవలసింది ఏమిటంటే గురువు కేవలం మార్గదర్శకుడు మాత్రమే. ఈవిధమైన మార్గంలో ప్రయాణం చేస్తే గమ్యస్థానాన్ని చేరుకుంటారని బోధిస్తాడు. అంతేగాని శిష్యులందరినీ చంకనెత్తుకొని వెళ్లడు.

అందుచేత పై విషయాలన్నీ దృష్టిలో ఉంచుకొని సాధనామార్గంలో ఉన్న సాధకుడు అమ్మలో లయమొందగలుగుతాడు.

**9. శ్రీచక్ర నవావరణార్చన విధి ఎట్టిది?**

**జ:** శ్రీచక్రం తొమ్మిది ఆవరణలు కలిగివుంటుంది. ఈ ఆవరణలలో దేవీ ఖడ్గమాలలో చెప్పబడిన దేవతామూర్తులు కొలువైవుంటారు. శ్రీచక్ర ఆవరణార్చన మూడువిధాలుగా చెప్పబడింది. సృష్టిక్రమ శ్రీచక్రనవావరణార్చన, స్థితిక్రమ శ్రీచక్రనవావరణార్చన సంహారక్రమ శ్రీచక్రనవావరణార్చన. సృష్టిక్రమార్చన బ్రహ్మ, స్థితిక్రమార్చన, విష్ణువు, సంహారక క్రమార్చన పరమేశ్వరుడు నిర్వహిస్తూ వుంటారు. సృష్టిక్రమార్చన చేసిన వెంటనే సంహారక క్రమార్చన చేయాలి. అదేవిధంగా స్థితిక్రమార్చన చేసిన వెంటనే సంహారకక్రమార్చన చేయాలి. సంహారక క్రమార్చన మాత్రం ఒక్కటే చేయవచ్చు. సృష్టి, స్థితి, సంహారక క్రమంగా చేసేటటువంటి శ్రీచక్రనవావరణార్చన విశేషాతి విశేషార్చనగా చెప్పబడుతుంది. ఇటువంటి అద్భుతఫలాన్నే అనుగ్రహిస్తుంది. శ్రీచక్రనవావరణార్చన సమయంలో 64

ఉపచారాలతో చతుష్షష్టి ఉపచార పూజ, గణపతి, సూర్య, విష్ణు, శివ షోడశోపచార పూజాదులు నిర్వహించి, ఒక్కొక్క ఆవరణలో కొలువైవున్న దేవతలకు పూజాతర్పణాదులు నిర్వహించి, గంధపుష్ప ధూపదీపనైవేద్య తాంబూల నీరాజనాదులు అర్పించి, నవావరణ దేవతాసహితంగా మహాకామేశ్వర, వామాంకస్థిత శ్రీమహాకామేశ్వరుని సహస్రనామాలతో, త్రిశతీ నామాలతో, అష్టోత్తర శతనామాలతో, హరిద్ర, కుంకుమ, అక్షత, తులసి, బిల్వ నానావిధ పరిమళ పత్రపుష్పాదులతో అర్చించాలి. నీరాజనాదులు అర్పించాలి. అనంతరం సువాసినీపూజ, కుమారీపూజ, సామయిక పూజ (పెద్దలు, గురువులు) పంచపంచికాపూజ, నిర్వహించాలి. అనంతరము తీర్థప్రసాదాదులు స్వీకరించి, అమ్మ అనుగ్రహం పొందాలి. శ్రీచక్ర నవావరణార్చనలో సమయ, వామ, కౌళ, శుద్ధ సమయ సంప్రదాయాదులున్నవి. వామకౌళాదులు, దూష్యములుగా తెలుసుకొని కేవలము బహిర్యాగమైన సమయాచార పూజను అంతర్యాగమైన శుద్ధసమయపూజను నిర్వహించిన భోగమోక్షాదులు కరతలామలకమగును. ఇది సత్యము.

**10. శ్రీమహాత్రిపురసుందరిని ఏవిధంగా పూజించాలి?**

**జ:** గురుప్రార్థన చేసి, మంత్రస్నానమాచరించి, నాలుగుసార్లు ఆచమనము చేసి, దీపారాధన చేసి, ఘంటానాదము చేసి, భూశుద్ధి, ప్రాణాయామాదులు గావించి, సంకల్పము చేసికొని, పంచోపచారాలతోగానీ, షోడశ ఉపచారాలతో గానీ, చతుష్షష్టి ఉపచారాదులతోగానీ పూజ గావించాలి. పంచోపచార పూజలో అమ్మవారికి గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్య, తాంబూలాదులు సమర్పించి

మంగళహారతి ఇవ్వాలి. షోడశ ఉపచారపూజలో ధ్యాన, ఆవాహన, ఆసన, పాద్య, అర్ఘ్య, ఆచమన, స్నాన, వస్త్ర, ఉపవీత, చందన, ఆభరణ, పుష్ప, హరిద్ర, కుంకుమ, ధూప, దీప, నైవేద్య, తాంబూలాదులను సమర్పించి మంగళహారతి ఇవ్వాలి. చతుష్షష్ఠి ఉపచార పూజలో పాద్య, ఆభరణావరోపణం, సుగంధి తైలాభ్యంగం, మర్జనశాల ప్రవేశనం, మర్జనశాలమణిపీఠోపవేశనం, దివ్య స్నానీయోద్వర్తనం, ఉష్ణోదకము, కనకకలశచ్యుత సకలతీర్థాభిషేకము, ధౌతవస్త్ర పరిమార్జనము, అరుణదుకూల పరిధానం, అరుణకుచోత్తరీయం, ఆలేపన మంటప ప్రవేశనం, ఆలేపనమంటప మణిపీఠోపవేశనం, చందనాగరు కుంకుమ మృగమద కస్తూరీ కర్పూర గోరోచనాది దివ్య గంధ, సర్వాంగీన విలేపనము, కేశభార్యస కాలాగరుధూపము, మల్లికామాలతీ జాతీచంపకాశోక శతపత్ర పూగ కుహళీ పున్నాగ కల్హార ముఖ్య సర్వఋతు కుసుమమాలాహా, భూషణమంటప ప్రవేశనము, భూషణమంటప మణిపీఠోపవేశనము, నవమణిమకుటము, చంద్రశకలము, సీమంత సింధూరము, తిలకరత్నము, కాలాంజనము, పాళీయుగళము, మణికుండల యుగళము, నాసాభరణము, అధరయావకము, ప్రథమభూషణము, కనకచింతాకము, పతకము, మహాపతకము, ముక్తావళిం, ఏకావళిం, ఛన్నవీరం, కేయూరయుగళ చతుష్టయము, వలయావళిం, ఊర్మికావళిం, కాంచీధామము, కటిసూత్రము, సౌభాగ్యాభరణము, పాదకటకము, రత్నమూపురము, పాదాంగులీయకము, ఏకకరేపాశము, అన్యకరే అంకుశము, ఇతరకరే పుండ్రేక్షుచాపము, అపరకరే పుష్పబాణాం, శ్రీమన్‌మాణిక్యపాదుకే, స్వసమాన వేషాభి రావరణదేవతాభిః సహ

మహాచక్రాధిరోహణము, కామేశ్వరాంక పర్యంకోపవేశనము, అమృతాస వచషకము, ఆచమనీయము, కర్పూరవీతికాం, ఆనందోల్లాస విలాసహాసము, మంగళారార్థికము, ఛత్రము, చామరయుగళము, దర్పణము, తాళవృంతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము సమర్పించి, మంగళహారతి ఈయవలెను. ఈవిధంగా శక్తినిబట్టి పూజాదికములు నిర్వహించవలెను. అమ్మవారిని కుంకుమతో అర్చించిన అన్నికోరికలు నెరవేరును. పసుపుతో అర్చించిన అమ్మవారు ప్రసన్నమగును. పరిమళపుష్పాలతో అర్చించిన జ్ఞానాన్ని ప్రసాదించును. పద్మాలతో అర్చించిన అష్టైశ్వర్యాలను, బిల్వదళాలతో అర్చించిన ధనధాన్య సమృద్ధిని, తులసీదళాలతో అర్చించిన లక్ష్మీకటాక్షాన్ని ప్రసాదించును.  సాంబ్రాణి, గుగ్గిలము, ధూపం వేసిన విశేషఫలము కలుగును. పాయసము, పరమాన్నము, చక్కెరపొంగలి, కట్టుపొంగలి, పులిహోర, దద్దోజనము, గారెలు, బూరెలు, చిత్రాన్నము వంటి నవకాయ పిండివంటలను సమర్పించాలి. అన్ని ఋతువులలో లభించేటటువంటి ఫల, పుష్పాదులను సమర్పించాలి. ఏక, నేత్ర, బిల్వ, నాగ, పంచ, సప్త, దశ, నక్షత్ర, రథ, కుంభ, గరుడ, నాగ, సింహ, గజ, వృషభ, హారతులను సమర్పించాలి. ఛత్ర, చామర, యుగళ, తాళవృంత, రాజదండ, దర్పణాదులను రాజోపచారాలుగా సమర్పించాలి. గీత, వాద్య, నృత్యాదులను సమర్పించాలి. దర్బారుసేవ గావించాలి. ఈవిధంగా శక్త్యానుసారంగా అమ్మవారిని ఆరాధించిన అఖండఫలం లభిస్తుంది. శక్తికి లోబడి అమ్మను ఆరాధించిన శక్తికిమించి ఆరాధించిన ఫలితం మాత్రం శూన్యమే అవుతుంది. అందుచేత అమ్మ చెప్పిన విధంగా యథాశక్తి అమ్మను

ఆరాధించి, అద్భుతఫలాలు సాధించాలి. వందలు, వేల దీపాలతో అమ్మ ఆనందిస్తుంది. అమ్మ నామసంకీర్తనతో వరాలు ప్రసాదిస్తుంది. ఇంకనూ శక్తినిబట్టి చేసేటటువంటి విశేషపూజలకు విశేషఫలాలను అనుగ్రహిస్తుంది.

**11. శ్రీలలితాసహస్రనామ స్తోత్ర పారాయణము ఏవిధంగా చేయాలి?**

**జ:** స్తోత్రరాజమే శ్రీలలితాసహస్రనామ స్తోత్రము. ఈ సహస్రనామ స్తోత్రాన్ని శ్రీలలితామహాత్రిపురసుందరీ అమ్మవారి ఆదేశానుసారం భక్తజనుల కోర్కెలు తీర్చేటటువంటి భవరోగాలను రూపుమాపేటటువంటి అత్యద్భుత ఫలితాలను ప్రసాదించేటటువంటి అమ్మ గుణగణాలను అభివర్ణించడమంటే అమ్మను ప్రీతి కలిగించేటటువంటి విధంగా వసిన్యాది వాగ్దేవతలు అనగా వశినీదేవి, కామేశ్వరీదేవి, మోదినీదేవి, కమలాదేవి, అరుణాదేవి, జీనీదేవి, సర్వేశ్వరీదేవి, కౌళినీదేవిలు ఎనమండుగురు వాగ్దేవతలు, శ్రీలలితా సహస్రనామ స్తోత్రాన్ని అమ్మ కనుసైగతో ఆశువుగా రచించారు. ఈ రహస్యనామ స్తోత్రం స్తోత్రరాజంగా భక్తులపాలిట కల్పతరువుగా అలరారుతోంది. ఈ రహస్యనామ స్తోత్రాన్ని చాతుర్వర్ణాలవారు, స్త్రీ, పురుష వయోభేదం లేక పారాయణ గావించుకోవచ్చు. ఈ స్తోత్రపారాయణము అష్టైశ్వర్య భోగభాగ్యప్రాప్తిని కలుగచేస్తుంది. ఈ స్తోత్ర పారాయణ అనంతరము ఎటువంటి నివేదనలు చేయనవసరములేదు. ఏ సమయంలోనైనప్పటికీ ఈ స్తోత్ర పారాయణ చేయవచ్చు. రాత్రికాలమందు ఈ స్తోత్ర పారాయణము చేసినట్లయితే విశేషఫలం లభిస్తుంది. అకాలమృత్యువు హరింపబడుతుంది. మృత్యువు సకాలంలో వస్తుంది. త్రికాలజ్ఞానం కలుగుతుంది. త్రిగుణాలకు అతీతత్త్వాన్ని ప్రసాదిస్తుంది. శత్రువులు మిత్రులవుతారు. దీనులందరూ

ధీరులవుతారు. శరభేశ్వరుడే శక్తినిస్తాడు. సర్వరోగాలు శమింపబడతాయి. సకలసంపదలు సమకూరుతాయి. కోటిజన్మలు గంగలో మునిగినా ఎంత ఫలం వస్తుందో, కురుక్షేత్రంలో కోటి దానములు ఎంత ఫలం వస్తుందో, కోటి లింగములు ప్రతిష్ఠిస్తే ఎంత ఫలం వస్తుందో, ఆ ఫలాలన్నీ కూడా లలితాసహస్రనామ స్తోత్ర పారాయణముతో సరితూగలేవు. కోటిసూర్యుల కాంతిని, కోటిరుద్రుల శక్తిని, కోటిబ్రహ్మల సృష్టిని కలిగినది. ఈ విషయాన్ని హయగ్రీవుడే స్వయంగా తెలిపాడు. జీవితకాలంలో ఈ సహస్రనామ పారాయణం ఒకసారి చేసినట్లయితే భక్తిమార్గం గోచరిస్తుంది. భుక్తిముక్తులు రెండూ కూడా లభిస్తాయి. పౌర్ణమినాటి చంద్రునిలో లలితాదేవిని ధ్యానం చేసి, ఈ సహస్రనామ స్తోత్రాన్ని పారాయణం చేసినా, విన్నా, మోక్షం లభిస్తుంది. వేయేల ఏమి సంకల్పించి, ఈ పారాయణం చేసినా ఆ సంకల్పం సిద్ధిస్తుంది. సంకల్పించినా, సంకల్పించకపోయినా అద్భుతఫలాలని ప్రసాదిస్తుంది ఈ స్తోత్రరాజము.

**12. దేవీభాగవతాన్ని ఏవిధంగా పారాయణం చేయాలి?**

**జ:** శ్రీదేవీభాగవతాన్ని సద్గురువుద్వారా పొంది, పూజామందిరంలో వ్యాసపీఠమందు ఉంచి, ప్రతినిత్యము యథాశక్తి పంచోపచారాలతో పూజించి, పూజానంతరము ఈ పారాయణాన్ని చేయాలి. ప్రతినిత్యము ఒక్కో అధ్యాయంగా కానీ, మూడు అధ్యాయాలు గానీ, ఐదు అధ్యాయాలు గానీ, ఏడు అధ్యాయాలు గానీ, తొమ్మిది అధ్యాయాలు గానీ, పద్దెనిమిది అధ్యాయాలు గానీ, పూర్ణ పారాయణ గానీ చేయవచ్చు. ఈ పారాయణం చేయు సమయంలో మన నోటితుంపరలు గ్రంథరాజముపై పడకుండా చూసుకోవాలి. అమ్మకు సంబంధించినటువంటి అనేక విషయములు,

అమ్మతత్త్వము, అసురసంహారము, నవరాత్రిపూజావిధి, అమ్మవారి అవతారవిశేషాదులు, మణిద్వీపవర్ణన, గాయత్రీ విశిష్ఠత, ఇత్యాది అనేకమైన విషయాలు ఈ భాగవతపారాయణవల్ల మనకు అవగతమవుతాయి. ఈ దేవీభాగవత పారాయణం చైత్రమాసంలో వచ్చే వసంతనవరాత్రులలో, ఆషాఢమాసంలో వచ్చే గ్రీష్మనవరాత్రులలో, ఆశ్వీజమాసంలో వచ్చే శరన్నవరాత్రులలో, మాఘమాసంలో వచ్చే శిశిరనవరాత్రులలో పారాయణం చేసిన విశేషఫలం లభిస్తుంది.

ఏదైనా ఒక సంకల్పం చేసుకొని, ఆ సంకల్పసిద్ధికొరకు దేవీభాగవతాన్ని మండలదీక్షగాకానీ అనగా 41 రోజులు, అర్ధమండల దీక్షగాగానీ అనగా 21 రోజులు, నవరాత్రదీక్షగాగానీ అనగా 9 రోజులు పారాయణం చేయాలి. పారాయణ అనంతరం ఫలపుష్పాదులు సమర్పించి, కొబ్బరికాయ కొట్టి మంగళహారతివ్వాలి. ఈవిధంగా దేవీభాగవత పారాయణం చేసినట్లయితే అమ్మ అనుగ్రహం తప్పక కలుగుతుంది.

**13. సౌందర్యలహరి స్తోత్రం విశిష్ఠత ఏమిటి? పారాయణ ఫలమేమి?**

**జ:** ద్రవిడదేశంలో ఒక బాలునికి తన తల్లి ఒక గిన్నెతో పాలిచ్చి అమ్మవారి యొక్క దేవాలయానికి వెళ్లి ఆరగింపు చేసి రమ్మన్నది. ఆ పిల్లవాడు పాలు తీసుకొనివెళ్లి అమ్మ ముందుంచి, పాలు త్రాగమని ప్రార్థిస్తాడు. అమ్మ స్వీకరించదు. చాలాసార్లు త్రాగమని బ్రతిమాలుతాడు. అమ్మ ప్రత్యక్షంకాదు. భోరుభోరున ఏడ్వటం ప్రారంభిస్తాడు. అయిననూ తల్లి రాలేదు. చివరకు చేసేదిలేక అమ్మ పాదపీఠంపై తలను కొట్టుకోవడం ప్రారంభిస్తాడు. రక్తం ఏరులై ప్రవహిస్తోంది. అమ్మ కాలికి వెచ్చటి నెత్తురు తగిలి ఉలిక్కిపడి ఆ దృశ్యాన్ని చూస్తుంది. వెంటనే ప్రత్యక్షమౌతుంది. తలనిమిరి గాయాన్ని

మాన్పి ఎందుకు నాయనా! ఇంత ప్రయత్నం చేశావు. నన్నెందుకు పిలిచావు అని ప్రశ్నించిందామె. అమ్మా! ఈ పాలు త్రాగు అన్నాడు పసిపిల్లాడు. ఓస్ ఈ మాత్రం దానికేనా ఇంత ప్రయత్నం చేశావని గడగడా పాలు త్రాగింది. మళ్లీ భోరున ఏడ్వటం ప్రారంభించాడు. అయ్యయ్యో! మళ్లీ ఎందుకు ఏడుస్తున్నావు నాయనా! అని ప్రశ్నించింది. మొత్తం పాలన్నీ నీవే త్రాగేస్తే నా పరిస్థితి ఏమిటి అని విలపించసాగాడు. పసిహృదయానికి పరవశించింది పరాంబిక. దగ్గరకు తీసుకొంది. తన స్తన్యాన్ని ఇచ్చింది. త్రాగుతున్న శిశువు ఆదిశంకరాచార్యులు. పాలిచ్చిన పరాంబిక బాలాత్రిపురసుందరి. అమ్మయొక్క స్తన్య ప్రభావంచే అమ్మయొక్క దివ్యస్వరూప వర్ణన ఆసువుగా చెప్పసాగాడు శంకరాచార్యులవారు. ఆ దివ్యస్తోత్రరాజమే సౌందర్యలహరి స్తోత్రం. ఈ స్తోత్రమందు ఉండే వందశ్లోకాలు వంద మహామంత్రాలు. ఆ స్తోత్రపారాయణ విధిని తెలిపే తంత్రాలు వంద. ఆ తంత్రం వెనుక దాగివున్న రహస్య యంత్రాలు వంద. ఈ సౌందర్యలహరి స్తోత్రం మహామంత్ర, మహాయంత్ర, మహాతంత్రశాస్త్రం. ఈ స్తోత్రరాజాన్ని పారాయణం చేసినటువంటి సాధకులకు మహాత్రిపురసుందరీ అమ్మవారి కరుణాకటాక్షవీక్షణలు కరతలామలకమవుతాయి. ఈ గ్రంథరాజాన్ని కూడా దేవీభాగవతంవల్లే సశాస్త్రీయంగా పంచోపచారాలతో ఆరాధించి, అనునిత్యం పారాయణ చేసిన అష్టైశ్వర్య భోగభాగ్యప్రాప్తి కలుగుతుంది. అద్భుతమైన అష్టసిద్ధులు, నవనిధులు సమకూరతాయి. అమ్మ అనుగ్రహం సంపూర్ణంగా కలుగుతుంది. అమ్మ ఉపాసకుడైన ప్రతీ ఒక్కరూ పారాయణ చేయదగిన గ్రంథరాజమిది.

## 14. శ్రీవిద్యోపాసక ధర్మాలు ఏవి?

**జ:** సద్గురువుకు ఉపచర్యలు చేయవలెను. దానిలో లవలేశమైన కూడా లజ్జ ఉండరాదు. గురువు చెప్పినరీతిలో ఆచరించవలెను. గురువు చెప్పిన వాటిలో మంచి-చెడులను ఎంచరాదు. అంచనా వేయరాదు. తనతోటి సాటి శిష్యులను తెలిసికొని సఖ్యముగా ఉండవలెను. గురువును దర్శించిన తోడనే నమస్కారము చేయవలెను. గురువువద్ద నడచుకొను విధముగ గురుపుత్రులవద్దను, గురుపత్నివద్దను, గురువుయొక్క జ్యేష్ఠశిష్యుని వద్దను కూడా పాటించవలెను. గురువును ఒక సాధారణ మానవునిగా కాకుండా పరదేవతా రూపముగా తలంపవలెను. గురువును దినమునకు ఒకసారిగాని, వారమునకు ఒకసారిగాని దర్శించుకొనవలెను. అట్లు వీలుకానియెడల లేక ఇతర ప్రాంతములలో ఉన్నవారు గురువు నివసించు దిశవైపు తిరిగి నమస్కారము చేయవలెను. గురువు, పరమగురువు కలసి వేంచేసినచో ముందుగా పరమగురువునకు నమస్కరించి వారి అనుమతితో గురువుకు నమస్కరించవలెను. గురువు ఉండగా శిష్యుడు మరెవ్వరికీ గురు అనుమతిలేకుండా ఉపదేశముకాని, దీక్షగాని యివ్వరాదు. శరీరము, ధనము, ప్రాణము గురువుకు అర్పణము చేయవలెను. సర్వజ్ఞుడైన ఒకే గురువును ఉపాసించవలెను.

గురుపర్వములలోను, పంచపర్వములలోను నియమముగా పూజ, ఆరాధనలు జరుపవలెను. గురుపర్వములు : స్వగురు, పరమగురు, పరమేష్ఠి గురువుల జన్మ దీక్ష వ్యాప్తి దినములు. పంచ పర్వములు : పౌర్ణమి, కృష్ణాష్టమి, కృష్ణచతుర్దశి, అమావాస్య, మాససంక్రమణము.

గురువాక్యములను, శాస్త్రములను కొంచెం కూడ సందేహించకూడదు.

శాస్త్రములో సందేహమున్నచో గురువాక్యమే ప్రమాణమగును. ఇతర ఉపాసకునియొక్క మతమును, ఆచారమును ఎట్టి పరిస్థితిలోను దూషించరాదు. అవహేళన చేయరాదు. తాను ఉపాసించే దేవతయే దేవతలలో గొప్పయని భావించవలెను. ఎల్లప్పుడు తాను ఉపాసించు దేవతయొక్క మంత్రమును నిదానముగా జపము చేసుకొనుచుండవలెను. నిత్య అనుష్ఠానము ముగించిన తరువాతనే శ్రీవిద్యా మంత్రజపములను చేయవలెను. శ్రీవిద్యా సంబంధ షట్పారాయణములను అనుష్ఠానమునకు తీసికొనవలెను. మంచి ఉత్తమ శిష్యునివద్దనే ముఖ్యమైన రహస్య విషయములను చెప్పవలెను. ఎల్లప్పుడునూ కామ, క్రోద, లోభ, మోహ, మద, మాత్సర్యములను విడిచిపెట్టవలెను. ఫలమును ఆశించకుండా కర్మలను ఆచరించవలెను. ఉపాసనకు విఘ్నము కలిగించువానిని తొలగించవలెను. ఆశ్రయించినవారిని అనుగ్రహించవలెను. అనుభవమున్న పెద్దలయెడ సద్బుద్ధితో మెలగవలయును.

**15. నవరాత్రులు ఎన్ని?**

**జ:** 1. చైత్రమాసములో శుద్ధ పాడ్యమి మొదలుకొని దశమి వరకు నిర్వహించే నవరాత్రులను వసంత నవరాత్రులని, దేవీ నవరాత్రులని పిలువబడుచున్నవి. 2. ఆషాఢమాసంలో శుద్ధ పాడ్యమి మొదలుకొని దశమి వరకు నిర్వహించే నవరాత్రులను గ్రీష్మ నవరాత్రులని, వారాహి నవరాత్రులని పిలువబడుచున్నవి. 3. ఆశ్వీజమాసంలో శుద్ధ పాడ్యమి మొదలుకొని దశమి వరకు నిర్వహించే నవరాత్రులను శరన్నవరాత్రులని, దుర్గా నవరాత్రులని పిలువబడుచున్నవి. 4. మాఘమాసంలో శుద్ధ పాడ్యమి మొదలుకొని దశమి వరకు నిర్వహించే నవరాత్రులను శిశిరనవరాత్రులని,

శ్యామలా నవరాత్రులని పిలువబడుచున్నవి. శ్రీవిద్యోపాసకుడు, అమ్మ భక్తుడైనవాడు ప్రయత్నపూర్వకంగా ఈ నాలుగు నవరాత్రులు నిర్వహించడానికి ప్రయత్నించాలి.

**16. నవరాత్ర వ్రత విధి ఏమి?**

**జ:** శ్రీదేవీ శరన్నవరాత్రులు ప్రారంభించే ముందురోజునాటికే పూజాసామగ్రి, పూజాద్రవ్యాలు, హోమద్రవ్యాలు సిద్ధం చేసుకోవాలి. పూజామందిరంలో 9 అంగుళాలు ఎత్తుగల పీఠాన్ని ఏర్పరచుకొని, ఆ పీఠముపై ఎర్రని వస్త్రము పఱచి, బియ్యము పోసి, దానిపై సువర్ణ, రజిత, లేదా తామ్ర కలశమును ఉంచి, కలశమునకు దారములు చుట్టి, కలశములో పరిశుద్ధ నదీజలములను నింపి, అందు లవంగములు, యాలకులు, జాజికాయ, జాపత్రి, పచ్చకర్పూరము మొదలగు సువర్ణద్రవ్యాలు వేసి, నవరత్నాలు, పంచలోహాలను వేసి, పసుపు, కుంకుమ, రక్తచందన, చందనాదులను వేసి, మామిడి, మారేడు, మోదుగ, మఱ్ఱి, జమ్మి చిగుళ్ళను ఉంచి, పరిమళ పుష్పాదులను వేసి, దానిపై పీచు తీయని, ముచ్చిక కలిగిన టెంకాయనుంచి, దానిపై ఎఱ్ఱని చీర, రవిక వేసి, కలశమును చందన, కుంకుమ, పుష్పాదులతో అలంకరించి, యథా శాస్త్రీయముగా విఘ్నేశ్వరపూజ గావించి, రక్షాబంధన పూజ గావించి, రక్షాబంధనాన్ని ధరించి, కలశస్థాపన పైన చెప్పినవిధంగా చేసి, ప్రాణప్రతిష్ఠ, కళాన్యాసములు గావించి, షోడశ ఉపచారములతో శ్రీసూక్త విధానంగా, సహస్ర నామములతో, త్రిశతీ నామములతో, అష్టోత్తర శతనామములతో, దేవీఖడ్గమాలా నామములతో, పసుపు, కుంకుమ, హరిద్రాక్షతలు, కుంకుమాక్షతలు, రక్తచందనాక్షతలు, శ్రీచందనాక్షతలు, బిల్వదళములు,

తులసీదళములు, పరిమళ పుష్పాదులతో అర్చన గావించి, నవకాయ పిండివంటలతో రకరకాలైన ఫలములను, చలివిడి, వడపప్పు, పానకము, తేనె, పంచదార, పెరుగు, ఆవునెయ్యి నివేదన గావించి, మంగళహారతిచ్చి అమ్మవారిని ఈవిధంగా ప్రార్థించాలి. తల్లీ! ఈ నవరాత్రులు నా ఈ శరీరాన్ని, మనసును నీ అధీనం చేస్తున్నాను. నాచే ఈ నవరాత్ర వ్రతదీక్ష దిగ్విజయంగా నిర్వహింపచేసుకొని, నన్ను ఆశీర్వదించు తల్లీ! అని ప్రార్థించాలి. హస్తా నక్షత్రముతో కూడుకొన్న పాడ్యమినాడు మాత్రమే కలశస్థాపన చేయాలి. ఈవిధంగా నవరాత్ర వ్రతము ఆరంభించిన దగ్గరనుండి బ్రాహ్మీముహూర్తంలో నిద్రలేచి, స్నానసంధ్యాదులు ముగించుకొని, త్రికాలార్చనగానీ, షట్కాలార్చనలతోగానీ అమ్మవారిని తృప్తిపరుస్తూ, ఉదయంనుండీ, సాయంత్రంవరకూ ఉపవాసముండి, సాయంకాల అర్చన ముగించుకొని, అమ్మవారికి మహానివేదన చెల్లించి, నక్షత్రములను దర్శించి భోజనము చేయాలి. ఉల్లి, వెల్లుల్లి విసర్జించాలి. సాంసారిక సుఖానికి దూరంగా ఉండాలి. మౌనంగా ఉండాలి. పరిశుద్ధంగా, పవిత్రంగా ఉండాలి. భూమిపైనే శయనించాలి. ప్రతినిత్యము అమ్మవారిని నవదుర్గా రూపములో అలంకరించుకొని ఆరాధించాలి. అమ్మవారియొక్క విగ్రహాన్ని స్థాపన చేసుకోదలచిన వారు అమ్మవారు సింహవాహనాన్ని అధిరోహించి, అష్టభుజాలతో, అష్టవిధ ఆయుధాలను ధరించి, సౌమ్యమూర్తియై, అభయప్రదానం చేసే సౌమ్యస్వరూపిణిగా గానీ, చతుర్భుజాలతో పద్మాసనం వేసుకొని, సింహాసనం మీద కూర్చొని, చతుర్భుజాలలో అభయ, వరద, పాశ, అంకుశములను ధరించి, సౌమ్యమూర్తిగా కిరీటములో చంద్రవంకను ధరించినటువంటి

విగ్రహాన్నిగానీ స్థాపించుకొని ఆరాధించాలి. ప్రతినిత్యము అమ్మకు ప్రియమైన చండీసప్తశతీ, దేవీభాగవత, సౌందర్యలహరి పారాయణలను చేసుకుంటూ వుండాలి. సువాసినీపూజ, కుమారీపూజ, శ్రీచక్ర నవావరణార్చనాది అర్చనలతో అమ్మవారిని తృప్తిపరుస్తూ ఉండాలి. గీత, వాద్య, నృత్యాదులతో అమ్మవారికి ఆనందాన్ని కలుగచేయాలి. నామసంకీర్తనలతో ఆ తల్లిని ఆనందింప చేయాలి. వందలు, వేల దీపాలు వెలిగించి ఆ తల్లికి సంతోషాన్ని కలుగచేయాలి. అమ్మవారికి ప్రియమైన శ్రీవిద్య, చండీ, దశమహావిద్యాది హోమాదులతో అమ్మను తృప్తిపరచాలి. అమ్మకు ప్రియమైన బాలాషడక్షరీ, లలితాపంచదశాక్షరీ, రాజరాజేశ్వరీ మహాషోడశాక్షరీ, మహామంత్రాదులను యథాశక్తి జపించాలి. ఎఱ్ఱని వస్త్రాలు మాత్రమే ధరించాలి. ఎర్రచందనము, చందనము, పసుపు, కుంకుమ ధరించాలి. అమ్మకు ప్రియమైన ముత్యాల, పగడాల, రుద్రాక్ష మాలికలను ధరించాలి. అమ్మభావన కలిగి, అమ్మను ఆరాధిస్తూండాలి. పరుషమైన మాటలు, అమంగళకరమైన వాక్యాలు పలుకకూడదు. పండితులు, బ్రాహ్మణులు, భక్తులు విచ్చేసినయెడల శక్త్యానుసారము పూజించి, సత్కరించాలి. ఈవిధంగా శక్త్యానుసారము నవరాత్రవ్రతాన్ని ఆచరించాలి.

**17. శ్రీదేవీ నిత్యకర్మానుష్ఠానము ఏవిధంగా చేసుకోవాలి?**

**జ:** బ్రాహ్మీ ముహూర్తంలో నిద్రలేచి, స్నానాదికములు ముగించుకొని, పూజాగృహంలో ప్రవేశించి, గురువును ప్రార్థించి, శ్రీసూక్తవిధానంగా అమ్మవారిని సహస్రనామాలతో, త్రిశతీ నామాలతో, ఖడ్గమాలతో, అష్టోత్తర శతనామాలతో అర్చన చేసి, చలివిడి, వడపప్పు, పానకము, ఫలములు నివేదనచేసి, మంగళహారతిచ్చి, పూజ ముగించి సహస్రనామ, త్రిశతీనామ,

అష్టోత్తరశతనామ స్తోత్ర పారాయణములు చేసుకొని, కవచ, మాల, త్రైలోక్య విజయ, మంత్రాదులను పారాయణం చేసి, గురువు ప్రసాదించిన మహామంత్రాన్ని వెయ్యిమార్లుగానీ, ఐదువందల మార్లుగానీ, మూడువందల మార్లుగానీ, 108 మార్లుగానీ జపించి, అమ్మవారియొక్క దివ్యమంగళ స్వరూపాన్ని ధ్యానించి, పూజామందిరం నుండి బయటకు వచ్చి మనయొక్క వృత్తిధర్మాలను నిర్వర్తించుకొంటూ, త్రికాలములలో సంధ్యావందనం ఆచరిస్తూ, రాత్రికాలంలో ఇదేవిధంగా పూజ, స్తోత్ర, జప, ధ్యానాదులను నిర్వహించుకొనిన విశేషాతివిశేష ఫలము లభిస్తుంది. మన శక్తినిబట్టి ఈ కర్మానుష్ఠానము చేసుకొనవలెను. శ్రీచక్రనవావరణార్చన, సౌందర్యలహరి, చండీసప్తశతి, దేవీభాగవత, దేవీభాగవతాది పారాయణలు, శక్త్యానుసారంగా నిర్వహించుకొనవచ్చును. సమయాన్ని వృథాచేయక ఏదోవిధంగా అమ్మ ఉపాసన చేయుటకే ప్రయత్నం చేయాలి.

**18. ఆసనవిధి ఎట్టిది?**

**జ:** తిష్ఠ కుదిరితేగానీ నిష్ఠ కుదరదన్నారు పెద్దలు. అందుచేత మనము సుఖాసనాసీనులమై పూజ, స్తోత్ర, జప, ధ్యానాదులను నిర్వహించుకోవాలి. మనము అధిష్ఠించే పీఠము భూమికి 9 అంగుళాలు ఎత్తులో ఉండేటట్లుగా చెక్కతో తయారు చేయించుకొని, దానిపై కూర్మయంత్రాన్ని లిఖించి, దానిపై దర్భాసనము వేసుకొని, దర్భాసనముపై చిత్రాసనము వేసుకొని, చిత్రాసనముపై తెల్లని ధావళిని వేసుకొని మన ఆసనాన్ని సిద్ధం చేసుకోవాలి. పీఠం తయారుచేసే విషయంలో ఇనుపమేకులు వాడకుండా జాగ్రత్తపడాలి. పీఠంయొక్క నాలుగు కోళ్లు పులిపాదాలతో వుండాలి. ఈ చెక్కకు ఎర్రచందనము, చందనము, పనస, నేరేడు, టేకు, గుగ్గిలము, నల్ల

విరుగుడు చేవ కలపను వాడాలి.

**19. అమ్మవారివద్ద ఏవిధంగా దీపారాధన చేయాలి?**

**జ:** నిత్యమూ మనము చేయు దీపారాధన వల్ల మన ఆత్మజ్యోతి ప్రకాశిస్తూ మనము నిర్వహించే పూజ, స్తోత్ర, జప ధ్యానాదులు అఖండ ఫలాన్నిస్తాయి. అమ్మవారికి కుడివైపు ఆవునెయ్యితో తెల్లని గుడ్డ వత్తి వేసి, ఎడమవైపు నూపప్పు నూనెతో ఎర్రగుడ్డ వత్తి వేసి దీపారాధన చేయాలి. దీపారాధన అగ్గిపుల్లతో చేయరాదు. అగ్గిపుల్ల వెలిగించి, దానిద్వారా కైవత్తినిగానీ, అగరుబత్తినిగానీ వెలిగించి దీపారాదన చేయాలి. దీపారాధన చేసిన అనంతరం దీపారాధన కుంది మొదట్లో, పసుపు, కుంకుమ, అక్షతలు, పుష్పాలు ఉంచి నమస్కరించాలి.

**20. మహామంత్రజపానుష్ఠానానికి ఏ జపమాలలు ఉపయోగించాలి?**

**జ:** అమ్మ జపానికి చందన, రక్తచందన, తులసి, స్ఫటిక, శంఖ, ముత్యాల, పగడాల, రుద్రాక్షమాలలను ఉపయోగించవచ్చు. అన్ని మాలల్లో కెల్లా రుద్రాక్షమాల జపం శ్రేష్ఠమైనది. ఏ మహామంత్రమైనప్పటికీ కూడా రుద్రాక్ష మాలతో చేయవచ్చు. 108 పూసలు గల మాల పూర్ణమాలగా, 54 పూసలుగల మాల అర్ధమాలగా, 27 పూసలుగల మాల నక్షత్రమాలగా, 36 పూసలు కలిగి అర్ధపూసలేని మాల అక్షయమాలగా చెప్పబడుతున్నది. పూర్ణమాల పూర్ణఫలాన్ని, అర్ధమాల మధ్యమఫలాన్ని, నక్షత్రమాల అధమఫలాన్ని, అక్షయమాల అక్షయ ఫలాన్ని ప్రసాదిస్తుంది. అక్షరలక్షలు జపం చేసే విషయంలో అడ్డపూస కలిగిన పూర్ణమాలను మాత్రమే ఉపయోగించుకోవాలి. ఎందుకంటే ఇక్కడ సంఖ్య ప్రధానం. సిద్ధిక్రమం పూర్తయిన పిదప అక్షయమాలను ఉపయోగించి, జపము చేసిన విశేషఫలం

లభించును. జపమాల కుడిచేతి, నడిమివేలు, నడిమి కణుపుపై వుంచి, బొటనవ్రేలితో మనవైపుకు జపము చేయాలి. చూపుడువేలు, ఎడమచేయి జపమాలకు తగలకుండా జాగ్రత్తపడాలి. జపము చేయునపుడు జపమాల కంటికి కనపడరాదు. వస్త్రము కప్పిగానీ, గోముఖీ సంచిగానీ ఉపయోగించిగానీ జపము చేసిన విశేషఫలం కలుగుతుంది. జపము చేయునపుడు అడ్డపూసను దాటి చేయరాదు. జపమాలను వెనుకకు త్రిప్పి మరలా జపము చేయవలయును. మంత్రాన్ని బయటకు ఉచ్ఛరిస్తూ చేసే జపాన్ని వాచక జపమని, మంత్రాన్ని నోట్లో చెప్పుకుంటూ చేయు జపాన్ని ఉపాంశు జపమని, హృదయంలో మానసికంగా చేయు జపాన్ని మానసిక జపమని పిలుస్తారు. వాచక జపము అధమఫలాన్ని, ఉపాంశు జపము మధ్యమఫలాన్ని, మానసిక జపము అఖండఫలాన్ని ప్రసాదిస్తాయి. జపమాలను ముఖానికి ఎదురుగా ఉంచి జపము చేసినయెడల ఉత్తమఫలము, హృదయస్థానంలో ఉంచి చేసిన మధ్యమఫలము, నాభిస్థానంలో ఉంచి చేసిన అధమఫలము, నాభికి దిగువగా చేసేటటువంటి జపము అధమాతి అధమఫలాన్ని ఇస్తుంది. పై విషయాలన్నింటిని దృష్టిలో ఉంచుకొని సప్తాంగములతో మహామంత్రసాధన చేయాలి.

**21. సప్తాంగములు అనగా ఏమి?**

**జ:** మహామంత్రాన్ని సప్తాంగములతో ఉపదేశము ఇవ్వాలి, తీసుకోవాలి. ఋషి, ఛందస్సు, శక్తి, కీలకము, బీజము, అంగన్యాసకరన్యాసములు, ధ్యానము వీటినే సప్తాంగములు అంటారు.

**22. దండకమండలాల విశిష్ఠత ఏమిటి?**

**జ:** జపము చేయునపుడు హృదయస్థానము దాటి క్రిందకు రాకుండా

దండము రక్షిస్తుంది. అదేవిధంగా ఆచమన, తర్పణ, మార్జనాదులకు కమండలము అనుకూలంగా ఉంటుంది. దండమునకు బ్రాహ్మణులు రావి కర్రను, క్షత్రియులు మేడికర్రను, వైశ్యులు మోదుగ కర్రను, శూద్రులు మామిడి కర్రను వాడవలెను. కమండలానికి బంగారు, వెండి, రాగి, కంచు, పంచలోహములను వాడవలయును.

**23. గురుపాదుకల విశిష్ఠత ఏమిటి?**

**జ:** మంత్రదీక్ష ఇచ్చిన గురువు శ్రీగురువుగా, శ్రీగురువు గురువు పరమగురువుగా, పరమగురువు గురువు పరమేష్ఠి గురువుగా, పరమేష్ఠి గురువు పరాపర గురువుగా తెలుసుకోవాలి. దీక్షాసమయంలో గురువుద్వారా గురుపాదుకలను స్వీకరించి పూజామందిరంలో నిలిపి ఆరాధిస్తూ పూజాదికములు నిర్వర్తిస్తూ ఉండాలి. గురుపాదుకా రక్షణను మించిన రక్షణ ఇహపరములలో లేదు.

**24. కదంబవృక్ష విశిష్ఠత ఏమి? ఏవిధంగా పూజించాలి?**

**జ:** మణిద్వీపంలో, నవవిధ వనాలలో కదంబవనమనిన కామేశ్వరీ, కామేశ్వరులకు అత్యంత ప్రియము. ఈ వృక్షము సాక్షాత్తూ కల్పవృక్షముగా స్తుతింపబడుతున్నది. ఈ వృక్షము మణిద్వీపంలో ప్రతినిత్యము, భూలోకంలో అమ్మకు ప్రియమైన మాసములలో మాత్రమే పుష్పిస్తూ వుంటుంది. సూర్యాస్తమయానంతరం ఈ పుష్పాలు వికసిస్తాయి. వికసించిన అనంతరం వృష్ఠిగా కిందకు పడుతూంటాయి. చెట్టుక్రింద ఎర్రని, మెత్తని పాన్పు ఏర్పరుస్తుంది. ఈ వనంలో విహరిస్తూ కామేశ్వరీ, కామేశ్వరులిరువురూ కూడా ఈ పాన్పుపైనే పవళిస్తారు. ఈ పుష్పాలన్నా, ఫలాలన్నా అమ్మకు అమితమైన ప్రీతి. ఈ వృక్షము పుష్కరకాలానికి ఒకమారు మధువును

స్రవిస్తూ వుంటుంది. ఈ మధువును అమ్మకు నివేదన చేసి, స్వీకరించిన అనేకమైన రుగ్మతలు తొలగి సంపూర్ణమైన ఆరోగ్యము, ఆయుష్షు వృద్ధి అవుతాయి. కదంబ పుష్పములతో అమ్మకు చేయు పూజ అఖండఫలాన్ని అనుగ్రహిస్తుంది. ఈ కల్పవృక్షాన్ని సంకల్పసహితముగా షోడశ ఉపచారాలతో శ్రీసూక్త విధానంగా సాక్షాత్తూ అమ్మవారిని ఆరాధించేవిధంగా సహస్ర, త్రిశతీ, అష్టోత్తర, ఖడ్గమాలా నామాదులతో అర్చించి, మంగళహారతిచ్చి పూజించిన అనంతరం ప్రార్థించి మన కోర్కెలను చెప్పుకొనిన వెనువెంటనే ఆ కోరికలు నెరవేరతాయి. ఈ పూజ కదంబవృక్షము పుష్పించు సమయంలో చేసిన అఖండఫలం లభిస్తుంది. ఈ పుష్ప ఫలాదులతో అమ్మ మూలమంత్రము చెబుతూ కోపము చేసిన అక్షయఫలం లభిస్తుంది. దేవీభక్తులైనవారు యథాశక్తి పెరటిలోనూ, తోటలలోనూ, భక్తిశ్రద్ధలతో ఈ వృక్షాలను వృద్ధిచేస్తూ ఆరాధించాలి. ఈవిధంగా చేసిన భక్తులు అమ్మవారి హృదయంలో ప్రియభక్తులుగా నిలిచిపోతారు.

**25. అమ్మవారికి బలి ఏయే పశువులు ఇవ్వాలి? ఏవిధంగా ఇవ్వాలి?**

**జ:** అమ్మవారికి బలిగా మనిషి, దున్నపోతు, మేక, గొర్రె, పంది, కోడి ఈ ఆరింటిని బలిగా ఇవ్వవచ్చు. అయితే ఈ బలి ఇచ్చేముందు ఏ సందర్భంలో బలి ఇవ్వాలి అనేటటువంటి విషయాన్ని మనం తెలుసుకోవాలి. అమ్మవారికి ప్రియమైన చిదగ్ని హవనాన్ని నిర్వహించే సమయంలో ఈ ఆరు పశువులని బలి ఇవ్వవచ్చు. ఈ చిదగ్ని హవనం ఏవిధంగా చేయాలంటే వాయువునే మన మంత్రశక్తితో అగ్నిగా ప్రజ్వలింపచేయాలి. మనయొక్క రక్తాన్నే ఆజ్యంగా హవనం చేయాలి.

మనయొక్క శరీరంలోని మాంసఖండాలనే సమిధలుగా ఉపయోగించాలి. ఈవిధంగా చిదగ్ని హవనం చేసే సమయంలో మన శరీరంలోని రక్తమాంసాలు ఉపయోగించినప్పటికీ అమ్మ సాక్షాత్కారం లభించకపోతే పై ఆరు పశువులను ఆశ్రయించమని చెప్పి పరాశక్తి, పరాశంభుడు ఉపదేశించారు. అందుచేత బలి ఇవ్వాలనుకొనేవారు మాత్రం ఈ సందర్భంలో మాత్రమే ఇవ్వాలి. ఈ సందర్భంలో కాక అమ్మవారి పేరు చెప్పి స్వార్థం కోసం ఇచ్చే బలి మహాపాపాన్ని కలుగచేయడమే కాకుండా అమ్మ ఆగ్రహానికి గురిచేస్తుంది. మనం ఇవ్వాల్సిన ఆరు పశువులు ఏమిటంటే కామ, క్రోద, లోభ, మోహా, మద, మాత్సర్యాలనేటటువంటి సత్యాన్ని మనం తెలుసుకోవాలి. మనలో ఉండేటటువంటి ఆరు పశువులను అమ్మవారి పాదాలచెంత బలి ఇచ్చినట్లయితే మనలో ఉండే పశుత్వం తొలగి, పశుపతిత్వం వెలుగొందుతుంది. మనలో ఈ ఆరు పశువులు ఉన్నంతకాలం పశుపత్తివం అణచబడుతుంటుంది. అందుచేతనే ఈ ఆరు పశువులను అమ్మ పాదాలచెంత బలి ఇవ్వాలని తెలుసుకోవాలి.

**26. అమ్మవారిని స్మశానంలో ఏవిధంగా ఆరాధించాలి?**

**జ:** అమ్మ ఉపాసన స్మశానంలో చేసినట్లయితే అతిశీఘ్రుంగా మంత్రసిద్ధి చేకూరుతుంది. అమ్మ అనుగ్రహం కలుగుతుంది. అమ్మ సాక్షాత్కారం లభిస్తుంది. అయితే మనం స్మశానానికి వెళ్లివచ్చామంటే గోదావరిలో స్నానంచేసి, గంగాజలాన్ని శిరస్సున ప్రోక్షణ చేసుకుంటేనే గానీ శుద్ధి కాము. అటువంటిది స్మశానంలో ఏవిధంగా ఉపాసించాలి అనేటటువంటి సంశయం కలుగుతుంది. స్మశానంలో ఆరాధిస్తేనే మంత్రసిద్ధి కలుగుతుంది. దేవతానుగ్రహం లభిస్తుంది. అసలు స్మశానమంటే ఏంటో మనం

ప్రధానంగా తెలుసుకోవాలి. సాధకుడు తన హృదయాగ్నిలో అరిషడ్వర్గములను, ఆశలను, కోరికలను భస్మీపటలం చేస్తుంటాడు. అదే మహాస్మశానం. అమ్మ ఉపాసన స్మశానంలో చేయడమంటే మన హృదయంలో అమ్మను నిలిపి ఆరాధించుటే. ఈ సత్యాన్ని తెలుసుకొని ఆరాధిస్తే అఖండఫలం తప్పక లభిస్తుంది.

**27. అమ్మ ఆరాధన దిగంబరుడుగా చేయాలా?**

**జ:** అవును. దిగంబరుడుగానే చేయాలి. అమ్మ దిగంబరి. అంటే వివస్త్ర కాదని అర్థం. దిక్కులనే అంబరముగా ధరించిన విశ్వరూపిణి ఆ జగదంబిక. అటువంటి మహాశక్తి జగద్రక్షణిగా, జగత్‌పాలినిగా, జగద్రూపిణిగా లోకాన్ని రక్షిస్తూ వుంటుంది. అటువంటి మహాశక్తిని విశ్వమానవకళ్యాణార్థం ఆరాధించుటే దిగంబరుడుగా ఆరాధించడం అంటే విశాలమైన విశ్వభావనతో విశ్వరూపిణిగా అమ్మను ఆరాధించాలి. మన ఆరాధనాఫలం విశ్వమానవ కళ్యాణానికి తోడ్పడాలి.

**28. అమ్మను పంచమకారాలతో ఏవిధంగా ఆరాధించాలి?**

**జ:** అమ్మను పంచమకారాలతో ఆరాధించినట్లయితే అత్యద్భుత ఫలితాలను సాధించుకోవచ్చు. పంచమకారాలంటే మద్య, మత్స్య, మాంస, ముద్ర, మైథునాదులు. ఈ ఐదింటిని అమ్మవారికి సమర్పించాలి. అమ్మవారు మధుప్రియాయై నమః అను నామముతో ఆరాధింపబడుతుంటుంది. మధువు అంటే మూడర్థాలుంటాయి. తేనె, మద్యము, అమృతము. కొందరు తేనెను నివేదిస్తే మరికొందరు మద్యాన్ని నివేదిస్తారు. మరికొందరు అమృతం ఎక్కడ దొరుకుతుంటుందో వెతుకుతుంటారు. అమృతం బయట దొరికేదికాదు. అమ్మను స్వరూపాన్ని ధ్యానం చేసే సమయంలో

మూలాధారంలో ఉండేటటువంటి కుండలినీశక్తి ప్రేరేపించబడి, షట్చక్రాలను విభేదించి, భ్రూమధ్యంలో ఉండేటటువంటి జ్యోతిర్బిందు స్వరూపంలో వున్న పరమేశ్వరుడితో ఐక్యమొందిన సమయంలో శివశక్తుల స్వరూపం, శివలింగ స్వరూపంగా ఏర్పడుతుంది. ఆ పైన సహస్రార కమలానికి క్రిందిభాగంలో ధారాపాత్ర ఏర్పడుతుంది. అనంత విశ్వంలోని దైవీశక్తి ఆకర్షింపబడి, ధారాపాత్రను నిండుతుంది. ధారాపాత్రనుండి బొట్లుబొట్లుగా అమృతబిందువులు శివలింగాన్ని అభిషేకిస్తాయి. శివశక్తులిరువురూ ఆ అమృతబిందువులను పానం చేయగా మిగిలిన అమృతబిందువులు సోమసూత్రము గుండా కొండనాలుక వెనుక బొట్లుబొట్లుగా పడుతాయి. అటువంటి మధువున ఇష్టపడుతుంది అమ్మ. అటువంటి మధుపానం చేసినవాడు అమరుడవుతాడు. దేవతలందరూ ఈ అమృతాన్నే పానం చేస్తుంటారు. అంతేగాని గ్లాసుల్లో పోసేవిధంగా వుండదు అమృతం. అమ్మ దశముద్ర సమారాధ్యగా స్తుతింపబడుతుంది. ఈ దశముద్రలపైనే శ్రీవిద్య మొత్తము ఆధారపడివుంది. అమ్మ ఆరాధన మొత్తం ముద్రలపైనే ఆధారపడింది. గాయత్రీ మహామంత్రం 24 ముద్రలపైన, పంచదశాక్షరీ మహామంత్రం దశముద్రలపైన ఆధారపడివుంది. అటువంటి ముద్రలతో అమ్మవారిని ఆరాధించాలి. ముద్రారహితంగా చేసేటటువంటి అర్చన నిష్ఫలమవుఉతంది. గురువుద్వారా ఈ ముద్రలను నేర్చుకోవాలి.

అదేవిధంగా అమ్మవారు రతిప్రియాయైె నమః అనేటటువంటి నామముతో కూడా స్తుతింపబడుతుంది. స్త్రీ, పురుషుల సంయోగమే రతి అని కొందరు భ్రమిస్తుంటారు. అటువంటి రతి సలుపుతూ అమ్మవారిని

ఆరాధిస్తుంటారు. అమ్మ అంతర్ముఖ సమారాధ్య, బహిర్ముఖ సుదుర్లభగా అభివర్ణింపబడింది. అంతర్ముఖంగా మాత్రమే అమ్మ అనుగ్రహాన్ని పొందగలం గానీ, బహిర్ముఖంగా చేసేటటువంటి పూజలవల్ల మన కోరికలైతే నెరవేరుతాయిగానీ అమ్మ అనుగ్రహాన్ని మాత్రం పొందలేం. అటువంటి బాహ్యంగా చేసేటటువంటి ఈ రతివల్ల ఈవిధంగా అమ్మ అనుగ్రహం లభిస్తుందో, అసు రతి అంటే మనం ప్రధానంగా తెలుసుకోవాలి. ధ్యాన సమయంలో మూలాధారంలో వుండే కుండలినీ శక్తి భ్రూమధ్యంలోని జ్యోతిర్లింగేశ్వరుడితో ఐక్యమొందటాన్నే రథము అంటారు. అటువంటి రతి అంటే అమ్మకు అత్యంత ప్రియము. అంతేగాని బాహ్యమైన రతి అంటే ప్రియము కాదు. ఈ సత్యాన్ని మనం తెలుసుకోవాలి.

**29. దేవీనవరాత్రులు ఏవిధంగా ఆరంభమయ్యాయి?**

**జ:** మణిద్వీపములో చింతామణి గృహంలో కామేశ్వరీ, కామేశ్వరులిరువురు ఆనందపరవశులైవున్న సమయంలో సకల దేవగణ, ఋషిగణ, యోగినీ గణాదులు మహాకామేశ్వరుణ్ణి ప్రార్థించి, స్వామీ! మిమ్ములను పగటికాలమందు అమ్మను రాత్రికాలమందు ఆరాధిస్తూ తరిస్తున్నాము. ఒక్క రాత్రికాలమందైనా మిమ్ములను ఆరాధించాలనేటటువంటి కోరిక కలుగుతోంది అనుగ్రహించండి స్వామీ! అని వేడుకున్నారు. భక్తవశంకరుడైన మహాకామేశ్వరుడు మాఘమాసంలో కృష్ణపక్ష చతుర్దశినాటి రాత్రికాలము మీకు అనుగ్రహిస్తున్నానని వరప్రదానం చేశాడు. ప్రక్కనే వున్న మహాకామేశ్వరీ అయిన మహాత్రిపురసుందరి నా స్వామి నన్ను నిర్లక్ష్యంచేసి, నా అనుమతిలేకనే నా కాలమైన రాత్రికాలాన్ని తమ పూజ చేయుటకు అనుగ్రహించి, నన్నవమానించాడు. అవమానానికి

తట్టుకోలేని మహాకామేశ్వరి మహాకాళీరూపాన్ని దాల్చి, అనంతవిశ్వాన్ని మ్రింగేస్తానని చెప్పి శపథాలు చేస్తూ, ఉగ్రరూపిణియై, బిల్వవృక్షాన్ని ఎక్కి కూర్చొని వికటాట్టహాసాలు చేస్తోంది. అమ్మ ఉగ్రరూపానికి లోకాలన్నీ తల్లడిల్లిపోతున్నాయి. సర్వగణాలు మహాకామేశ్వరునివద్దకు పోయి స్వామీ! ఏమిటీ లీల! మేము మా ఆనందం కోసం మిమ్మల్ని రాత్రికాలంలో ఆరాధించాలని అడిగామనుకోండి. తమరు ప్రక్కనే వున్న అమ్మ అనుజ్ఞ లేకుండా ఏవిధంగా మాకు అనుజ్ఞ ఇచ్చారు. అమ్మవారికెందుకంత కోపం వచ్చింది. ఆ కోపాన్ని తగ్గించే ఉపాయాన్ని మీరే అనుగ్రహించాలని వేడుకొన్నారు. చిరునవ్వులు చిందిస్తూ మహాకామేశ్వరుడు అమ్మవారి ఉగ్రరూపాన్ని స్తోత్రాదులతో శాంతింపచేయమని ఆదేశించాడు. వారు ఆరుపగళ్లు, ఆరురాత్రుళ్లు అమ్మవారియొక్క ఉగ్రతత్వాన్ని శాంతింపచేసేందుకు ప్రయత్నం చేసి విఫలురై మహాకామేశ్వరుణ్ణి ఆశ్రయించారు. మహాకామేశ్వరుడు కూడా అమ్మ ఉగ్రరూపాన్ని తగ్గించేందుకు పరిపరివిధాల మూడు రాత్రుళ్లు, మూడు పగళ్లు ప్రయత్నించాడు. అయినప్పటికీ అమ్మ కోపం వృద్ధి అవుతోందే కానీ, తగ్గుముఖం పట్టలేదు. మహాకామేశ్వరి, మహాత్రిపురసుందరి నీ అనుజ్ఞ లేక నీ కాలమైన రాత్రికాలంలో నన్ను ఆరాధించుటకు అవకాశమిచ్చినందులకు గాను ఈ తొమ్మిది రాత్రుళ్లు, పది పగళ్లు నీయొక్క ఆరాధనకే అవకాశమిస్తున్నాను. శాంతించి బిల్వవృక్షం దిగివచ్చి లోకాలను ఉద్ధరించు అని ప్రార్థించాడు. అప్పుడు ఉగ్రకాళీరూపాన్ని ఉపసంహరించుకొని కామేశ్వరిగా, మహాకామేశ్వరుణ్ణి చేరింది. ఈ నవరాత్రులలో అమ్మకు ప్రియమైన, అద్భుతమైన సుగంధద్రవ్యాలతో,

హరిద్ర కుంకుమ పుష్పాదులతో, సాంబ్రాణి ఉగ్గులను, అగరు ధూపాలతో అమ్మవారిని సేవించిన సంపూర్ణ ఆయురారోగ్యములు వృద్ధిచెందును. ఈ నవరాత్రి కాలంలో జనులపాలిట యమదంష్ట్రాలు. అంటే యమునియొక్క కోరలు. ఈ సమయంలో అనేకమైన సూక్ష్మక్రిములు విశేషంగా వృద్ధి చెంది, జీవకోటిని నాశనం చేస్తాయి. ఈ సమయంలో ఈ యొక్క అద్భుత వనమూలికా ద్రవ్యాదులతో అమ్మవారిని ఆరాధించిన రోగభూయిష్టమైన దుష్టసూక్షక్రిములు అంతమొందించబడి, జీవకోటిని రక్షిస్తాయి. అందుచేతనే అమ్మ ఆగ్రహించి ఈ నవరాత్ర వ్రతానికి శ్రీకారం చుట్టింది. ఈ నవరాత్రులలోనే కృతయుగంలో దుర్గాదేవి మహిసాసుర సంహారం చేసినది. త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు రావణసంహారం గావించాడు, ద్వాపరయుగంలో పాండవులు అజ్ఞాతవాసాన్ని ముగించుకొని ఆయుధాలు ధరించి విజయాన్ని పొందారు. అందుచేత ఈ నవరాత్ర వ్రత విశిష్ఠత చెప్పుట ఆదిశేషునికి కూడా తరంకాదు.

**30. స్నానాలు ఎన్ని రకాలు? స్నానాదులు ఏవిధంగా నిర్వర్తించాలి?**

**జ:** జలముతో చేసేది వరుణస్నానం. గోధూళిలో నడచుట ధూళిస్నానం. హోమాగ్ని దగ్గర కూర్చొనిన అగ్నిస్నానం. ఆపోహిష్ఠాది మంత్రాలతో జలాన్ని శిరస్సుపై ప్రోక్షించుకొనుట మంత్రస్నానం. వరుణస్నానంలో తెల్లవారుఝామున 3 గం.లకు చేసేది ఋషిస్నానం. 4 గం.లకు చేసేది దేవస్నానం. 5 గం.లకు చేసేది మనుష్యస్నానం. 6 గం.లకు చేసేది రాక్షసస్నానం. 7 గం.లకు చేసేది పైశాచిక స్నానం. ఋషులు కావాలంటే 3 గం.లకు స్నానం చేయాలి. దేవతానుగ్రహం కలగాలంటే 4 గం.లకు స్నానం చేయాలి. మనిషి అనిపించుకోవాలంటే 5 గం.లకు స్నానం

చేయాలి. రాక్షసులు అనిపించుకోవాలంటే 6 గం.లకు స్నానం చేయాలి. పిశాచాలు అనిపించు కోవాలంటే 7 గం.లకు స్నానం చేయాలి. 7 గం.ల తర్వాత స్నానానికి పేరులేదు. ఈ వరుణస్నానాలలో సముద్రస్నానం, నదీస్నానం ప్రధానమైనటువంటివి. సంకల్పం చెప్పుకొని, నియమిత తిథి, వారాదులలో సముద్రస్నానం చేసి, స్నానమైన పిదప ఒడ్డుకు వచ్చి, ఒడ్డున వున్న ఇసుకను సముద్రంలోకి వేసి రావాలి. ఇంటికివచ్చి, శుద్ధమైన జలముతో స్నానం చేయాలి. సముద్రస్నానం చేసిన పిదప మంచినీటి స్నానం కనుక చేయకపోతే పురుషత్వం నశించి వంధ్యత్వం ప్రాప్తిస్తుంది. నదీస్నానం చేసేటప్పుడు స్త్రీలు ప్రవాహానికి వాలుగా, పురుషులు ప్రవాహానికి ఎదురుగా స్నానం చేయాలి. పురుషులు మునిగి స్నానం చేయవచ్చు. స్త్రీలు మునిగి స్నానం చేయకూడదు. ఏదైనా పాత్రతో స్నానం చేయాలి. స్నానానంతరం నదిలోని మట్టి ఒడ్డున వేసి రావాలి. ఈవిధంగా స్నానాదులను నిర్వర్తించాలి.

**31. భస్మాన్ని ఏవిధంగా తయారుచేయాలి? భస్మధారణవల్ల ఏ ఫలం లభిస్తుంది?**

**జ:** 1. నవవిధ సమిధలతో, సుగంధ ద్రవ్యములతో, వనమూలికలతో, శుద్ధమైన ఆవునేతితో, వేదవిదితమైన మహామంత్రోచ్ఛరణలనడుమ జరిగిన హవనముద్వారా లభించిన భస్మము హవనభస్మముగా గ్రహించాలి. 2. ఆవు పేడ వేసేసమయంలో భూమిపై పడకుండా గ్రహించి, భూమ్యాకర్షణలు లేక ఎండించి, అదేవిధంగా భస్మముగా చేసి, జల్లించి, ఎండు మారేడుకాయలు భద్రపరచిన భస్మము పవిత్రతను కలుగజేయునది. పై భస్మములలో ఏదో ఒక భస్మాన్ని ప్రతినిత్యము శిరఃస్నానము చేసినవారు,

తడి చేసిన భస్మాన్ని కంఠస్నానము చేసినవారు, పొడి భస్మాన్ని ధరించాలి. పురుషులు శరీరమంతా భస్మధారణ చేయవచ్చు. ఈవిధంగా భస్మధారణ చేసిన సంపూర్ణ ఆరోగ్యము, ఆయుర్ధాయము వృద్ధి అగును. భస్మమును నుదుట ధరించిన యెడల బ్రహ్మ రాసిన అనేకమైన చెడు రాతలు చెరగిపోవును.

**32. చందనము ఏవిధంగా సేకరించాలి? చందనధారణ ఫలం ఏమి?**

**జ:** రక్తచందన, చందన, శ్రీచందనములు విశేషమైన చందనములుగా మనం గ్రహించాలి. రక్తచందన వృక్షపు కాండమునుండి గ్రహించిన చందనము ఉగ్రమూర్తులైన దేవీమూర్తులకు అత్యంత ప్రీతిని కలుగజేయును. అదేవిధంగా చందనవృక్షపు కాండమునుండి గ్రహించిన చందనము సౌమ్యదేవతలకు ప్రీతిని కలుగజేయును. శ్రీచందనమనగా శైవపరముగా ఎండిన మారేడు చెట్టు కాండమునుండి గ్రహించిన చందనమును శ్రీచందనమని, వైష్ణవపరముగా ఎండిన తులసిచెట్టు కాండమునుండి గ్రహించిన చందనాన్ని శ్రీచందనమని గ్రహించాలి. ఈ శ్రీచందనము అష్టైశ్వర్యప్రాప్తిని కలుగజేస్తుంది. పై చందనములను ఆయా ఉపాసనలనుబట్టి ధరించాలి. "చందనస్య మహత్పుణ్యం పవిత్రం పాపనాశనం. ఆపదాంహరతే నిత్యం లక్ష్మీస్తిష్ఠతి సర్వదా" చందనాన్ని ధరించిన మహాపుణ్యం లభిస్తుంది. పవిత్రత చేకూరుతుంది. మనం చేసిన పాపములు హరించిపోతాయి. ప్రతినిత్యం వచ్చే ఆపదలు నశించిపోతాయి. లక్ష్మీదేవి చందనధారణ చేయువారి ఇంట స్థిరముగా కొలువై అష్టైశ్వర్య భోగభాగ్యములను కలుగజేయును.

**33. కుంకుమను ఏవిధంగా తయారుచేయాలి? ఏవిధంగా ధరించాలి?**

**జ:** పసుపుకొమ్ములను సేకరించి, నిమ్మరసంలో మూడు రోజులు నానబెట్టి, ఎండలో ఆరబెట్టి, కుంకుమరాళ్లను కలిపి, దంచి, జల్లించి, సేకరించినది ఉత్తమమైనది. ఇటువంటి కుంకుమతో అమ్మను ఆరాధించిన అన్నికోర్కెలు నెరవేరతాయి. కుంకుమను స్త్రీలు ప్రత్యక్షంగా ధరించవచ్చు. పురుషులు ముందుగా చందనమును ధరించి, ఆపైన కుంకుమను ధరించాలి. ఈవిధంగా ధరించనియెడల పురుషత్వము నశిస్తుంది. అదేవిధంగా పసుపును పురుషులు శరీరానికి పూసుకొనరాదు. పూసుకొనిన యెడల పురుషత్వము నశిస్తుంది.

**34. సువాసినీ పూజ ఏవిధంగా చేయాలి?**

**జ:** సలక్షణాలతో ఏవిధమైన అవయవలోపంలేని సౌమ్యమైన, ముత్తైదువను ఎంచుకొని, అమ్మవారిగా భావించి, షోడశ ఉపచారములతో శ్రీసూక్త విధానంగా సహస్ర, త్రిశతీ, అష్టోత్తర, ఖడ్గమాల నామములతో అర్చించి, మంగళహారతి ఇచ్చి, వస్త్ర, ఆభరణ, పుష్ప, హరిద్ర, కుంకుమ చందనాదులతో సత్కరించి, ఆ సువాసినితో ఆశీర్వచనము తీసుకొనిన సువాసినీపూజ పూర్తియగును. ఈ సువాసినీపూజ శ్రీచక్రనవావరణార్చన అనంతరం దేవీనవరాత్రులలో నిర్వహించాలి. శక్త్యానుసారం ఒక ముత్తైదువకుగానీ, ముగ్గురికిగానీ, ఐదుగురికిగానీ, ఏడుగురికిగానీ, తొమ్మిదిమందికిగానీ, పద్దెనిమిదిమందికి గానీ, ఇరవై ఏడుమందికి గానీ, యాభై నాలుగుమందికి గానీ, నూట ఎనిమిది మందికిగానీ, ఐదువందల యాభై ఎనిమిదిమందికి గానీ, వెయ్యిన్నూట పదహారు మందికిగానీ సువాసినీపూజ చేయవచ్చును. బ్రాహ్మణ ముత్తైదువలకు సువాసినీపూజ

చేసిన భక్తి, జ్ఞాన, వైరాగ్యములు, విద్యాభివృద్ధి కలుగును. క్షత్రియ ముత్తైదువలకు సువాసినీపూజ చేసిన ధైర్యసాహసములు వృద్ధియగును. వైశ్య ముత్తైదువలకు సువాసినీపూజ చేసిన అష్టైశ్వర్య భోగభాగ్యములు వృద్ధియగును. శూద్ర ముత్తైదువలకు సువాసినీపూజ చేసిన సత్సంతానప్రాప్తి కలుగును. మనయొక్క కామ్యమునుబట్టి సువాసినులను ఎంచుకొని, ఆహ్వానించి, ఆరాధించి, ఆశీస్సులు పొందవలయును.

**35. కుమారీపూజ ఏవిధంగా చేయాలి?**

**జ:** అమ్మవారికి ప్రియమైన అర్చనలలో కుమారీ అర్చన విశేషమైనది. శ్రీదేవీ నవరాత్రులలో మొదటిరోజు ఒక సంవత్సరం కలిగిన కన్యను బాలగ, రెండవ రోజు రెండు సంవత్సరాలు కలిగిన కన్యను కుమారిగా, మూడవరోజు మూడు సంవత్సరాలు కలిగిన కన్యను త్రిమూర్తిగా, నాల్గవరోజు నాలుగు సంవత్సరాలు కలిగిన కన్యను కళ్యాణిగా, ఐదవరోజు ఐదు సంవత్సరాలు కలిగిన కన్యను రోహిణిగా, ఆరవరోజు ఆరు సంవత్సరాలు కలిగిన కన్యను కాళికగా, ఏడవరోజు ఏడు సంవత్సరాలు కలిగిన కన్యకను చండికగా, ఎనిమిదవరోజు ఎనిమిది సంవత్సరాలు కలిగిన కన్యకను శాంభవిగా, తొమ్మిదవరోజు తొమ్మిది సంవత్సరాలు కలిగిన కన్యకను దుర్గగా, పదవరోజు పది సంవత్సరాలు కలిగిన కన్యకను సుభద్రగా భావించి షోడశఉపచారాలతో శ్రీసూక్త విధానంగా సహస్ర, త్రిశతీనామ, అష్టోత్తరశతనామ, దేవీఖడ్గమాలా నామాదులతో, హరిద్ర, కుంకుమ పుష్పాదులతో అర్చించి, మంగళహారతులిచ్చి, వస్త్ర, ఆభరణ, పుష్ప, చందనాదులతో సత్కరించి వారియొక్క ఆశీర్వచనము తీసుకొనిన సకలశుభములు కలుగును.

**36. సామయిక పూజ ఏవిధంగా చేయాలి?**

**జ:** శ్రీచక్ర నవావరణార్చన చేసిన అనంతరం నవరాత్రులలో మహా పూర్ణాహుతి వేసిన అనంతరం శ్రీగురువునకుగానీ, పరాపర గురువునకు గానీ, పరమగురువుకుగానీ, పరమేష్ఠి గురువుకుగానీ, అమ్మ ఉపాసకులకు గానీ, వస్త్ర, చందన, తాంబూలాదులతో సత్కరించి, యథాశాస్త్రీయంగా, శ్రీసూక్త విధానంగా షోడశోపచారాలతో ఆరాధనలు చేసి, మంగళహారతులిచ్చి, వారియొక్క ఆశీర్వచనమును పొందిన అమ్మ అనుగ్రహం కలుగును.

**37. నిరాకారిణిగా ఉన్న అమ్మ సాకారాన్ని ఏవిధంగా దాల్చింది?**

**జ:** నిరాకార, నిర్గుణ, పరబ్రహ్మ స్వరూపిణిగా ఉన్న పరాశక్తి సృష్టి చింత కలిగినపుడు శూన్యం నుండి శబ్దబ్రహ్మమయమైన ఓంకారంగా రూపొంది, ఓంకారము జ్యోతిర్బ్రహ్మమైన దివ్యజ్యోతిగా రూపొంది, జ్యోతిర్బ్రహ్మము కోటిసూర్య ప్రభాభాసమానమైన దివ్యతేజస్సుగామారి, ఆ దివ్యతేజస్సు నుండి బాలగా, బాలనుండి యవ్వనరూపిణియైన లలితగా, లలితనుండి ప్రౌఢరూపిణియైన రాజరాజేశ్వరిగా పరిణామం చెంది తన దక్షిణభాగం నుండి మహాకామేశ్వరుణ్ణి ఆవిర్భవింపచేసి, వారియొక్క దివ్యసంయోగంచేత తమోగుణ ప్రధానంగా మహాకాళి, రజోగుణ ప్రధానంగా మహాలక్ష్మి, సత్వగుణ ప్రధానంగా మహాసరస్వతి అవతరించారు. మహాకాళినుండి కోటానుకోట్లమంది విష్ణువులు, గౌరులు, అవతరించారు. మహాలక్ష్మినుండి కోటానుకోట్ల మంది బ్రహ్మలు, లక్ష్ములు అవతరించారు. మహాసరస్వతినుండి కోటానుకోట్లమంది శంకరులు, సరస్వతులు అవతరించారు. శ్రీమహాత్రిపురసుందరీ అనేకకోట్ల బ్రహ్మాండాలను సృష్టించి,

ఒక్కొక్క బ్రహ్మాండానికి సృష్టి చేయు నిమిత్తం రజోగుణ ప్రధానమైన పురుషుణికి సత్త్వగుణ ప్రధానమైన స్త్రీని ఇచ్చి వివాహం చేసి సృష్టికార్యాన్ని అప్పగించింది. స్థితి చేయు నిమిత్తం తమోగుణ ప్రధానమైన పురుషునికి రజోగుణ ప్రధానమైన స్త్రీని ఇచ్చి వివాహం చేసి స్థితికార్యాన్ని అప్పగించింది. లయకారము చేయు నిమిత్తం సత్త్వగుణ ప్రధానమైన పురుషునికి తమోగుణ ప్రధానమైన స్త్రీని ఇచ్చి వివాహం చేసి లయకార్యాన్ని అప్పగించింది. ఈవిధంగా త్రిమూర్తులు, త్రిమాతలు అవతరించి సృష్టి స్థితి లయాదులను జగదంబిక ఆదేశానుసారం ప్రారంభించారు.

**38. ఆదిశంకరాచార్యులవారు శక్తి విశిష్ఠత ఏవిధంగా తెలుసుకున్నారు?**

**జ:** శైవసంప్రదాయకులైన ఆదిశంకరుడు తన బాల్యములో బాలాత్రిపుర సుందరీ అమ్మవారి స్తన్యపాన ప్రభావముచేత తాను ఇంతటి శక్తివంతుడనైనానన్న సంగతి మరచి తన సంప్రదాయమైన శైవసంప్రదాయాన్ని బహుళ ప్రచారం చేస్తూ ఆసేతు హిమాచలం రెండుసార్లు పాదయాత్ర చేసి శివుడొక్కడే దేవుడు. శక్తిలేదు శక్తిలేదు అనేటటువంటి ప్రచారాన్ని చేస్తూ, వాదిస్తూ అనేకమైన పీఠాలను నెలకొల్పాడు. శక్తిలేదన్నమాట ఆదిశక్తి చెవినపడింది. శక్తివున్నదన్న సత్యాన్ని శంకరులకు తెలియజేయాలనుకున్నది. మాయా తటాకాన్ని సృష్టించింది. నిర్మలంగా, నిశ్చలంగా, ఆకర్షించేవిధంగా ఉందా తటాకం. శంకరాచార్యులవారు ఏకాంతంగా స్నానమాచరించే నిమిత్తం ఆ మాయా తటాకంలోకి దిగగానే తటాకంలోని ఊబిలోకి కూరుకొనిపోవడం ప్రారంభించాడు. ఎవరైనా రక్షించమని ప్రాధేయపడ్డాడు. ఆ నిర్జన ప్రదేశంలో మనుషుల జాడ కానరాలేదు. శంకరుణ్ణి పరిపరివిధాలుగా ప్రార్థించాడు.

జగత్స్తంభినీ అయిన అమ్మ పరమేశ్వరుడినే స్తంభింపచేసింది. శంకరాచార్యులవారి మొర పరమేశ్వరుడు ఆలకించలేదు. పీకలోతు కూరుకొనిపోయాడు. ఆ సమయంలో ఒక ముదుసలి అవ్వ కర్ర చేతపుచ్చుకొని, అమ్మ నామస్మరణ చేసుకుంటూ వెళుతూ వుంది. ఆ అవ్వను చూసిన శంకరాచార్యులవారు 'ఓ అవ్వా! కాస్త కర్ర అందించవు' అని వేడుకున్నాడు. అందుకావిడ 'శక్తి లేదు నాయనా!' అని అన్నది. ప్రాణాపాయ స్థితిలో వున్నాను. కాస్త కర్ర అందివ్వవు అని ప్రార్థించాడు. అప్పుడామె శక్తి లేదు నాయనా...! శక్తి లేదు అని అదృశ్యమయింది. శంకరాచార్యులవారు తన తప్పిదాన్ని తెలుసుకున్నాడు. శివుడు శక్తితో కూడుకొనివున్నప్పుడు మాత్రమే సృష్టిస్థితిలయాదులు చేయగలుగుతున్నాడన్న సంగతిని అవగతం చేసుకున్నాడు. వెనువెంటనే పరాశక్తిని ప్రార్థించాడు. మాయాతటాకం అదృశ్యమైంది. పరమేశ్వరి ప్రత్యక్షమైంది. పరిపరివిధాల స్తుతించాడు. శరణువేడాడు. అభయమిచ్చి ఆశీర్వదించింది జగదంబ. ఆదేశించింది అంబిక. నాయనా! అనేకమైన శక్తిపీఠాలు శిథిలమైపోతున్నాయి. శ్రీచక్రస్థాపన చేసి, శక్తిపీఠాలను ఉద్ధరించు అని ఆదేశించింది. అమ్మ ఆదేశానుసారం తిరిగి మరలా ఆసేతు హిమాచలం పాదయాత్ర చేస్తూ కేవలం 18 శక్తిపీఠాలను మాత్రము ఉద్ధరించి అమ్మలో ఐక్యమొందారు శంకరాచార్యులవారు.

### 39. ఎన్ని రకాల మానవులు ఉన్నారు?

**జ:** మానవులు ఉత్తములు, మధ్యములు, అధములు అని మూడు రకాలు ఉన్నారు. ఏదైనా పనిని ప్రారంభించి, ఎన్ని కష్టనష్టాలెదురైనా ఎదురు నిలిచి, పోరాడి పూర్తి చేయువాడు ఉత్తముడు. మధ్యలో వదలిపెట్టేవాడు

మధ్యముడు. ఏ పనినీ ప్రారంభించనివాడు అధముడు. అదేవిధంగా జంతు మానవులు. వీరు కేవలము తన భార్యాపిల్లలను మాత్రమే రక్షించుకొంటూ, పోషించుకొంటూ ఉంటారు. వీరిని జంతుమానవులుగా పిలుస్తారు. వృక్ష మానవులు. వీరు తమ భార్యాపిల్లలు, తనను ఆశ్రయించినవారిని రక్షించుకుంటూ ఉంటారు. వీరిని వృక్ష మానవులు అంటారు. మానవ మానవులు. అనగా మనుష్యులు. ప్రతీ మనిషి ఎదుటిమనిషి నుండి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సహాయ సహకారములు పొందుచున్నాడన్న సత్యాన్ని తెలుసుకొని, మానవసేవయే మాధవసేవగా గుర్తించి, మానవసేవ చేస్తూంటాడు. ఈయనే మానవ మానవుడు. విశ్వమానవుడు. అనంతవిశ్వంలో వుండే సకలజీవకోటి తనవంటివేనన్న సత్యాన్ని తెలుసుకొని ప్రతీ జీవిలోనూ పరమాత్ముడు ఉన్నాడన్న సత్యాన్ని తెలుసుకొని విశ్వమానవ కళ్యాణము కొరకు పూజిస్తూ, తపిస్తూ, ఆ వచ్చిన ఫలాన్ని లోకానికే ధారపోసేటటువంటి మహనీయుడు విశ్వమానవుడు. ఈయననే దైవమానవుడని కొలుస్తారు. జంతుమానవులుగా ఉన్నవారు వృక్ష మానవులుగా ఎదగడానికి, వృక్ష మానవులుగా ఉన్నవారు మానవ మానవులుగా ఎదగడానికి, మానవ మానవులుగా ఉన్నవారు విశ్వమానవులుగా ఎదగడానికి ప్రయత్నం చేయాలి. విశ్వమానవులే లోకంలో శాశ్వతంగా నిలిచిపోతారు. అందరికీ ఆదర్శవంతులౌతారు.

**40. పంచ ఋణాలు అంటే ఏమిటి?**

**జ:** భారతదేశంలో పుట్టిన ప్రతి మనిషీ ఐదు ఋణాలతో పుడతాడు. (1) మాతృఋణము. (2) పితృఋణము. ఈ రెండిటినీ కలిపి మాతృఋణంగానే పరిగణనలోకి తీసుకోవాలి. మన ఈ శరీరం

మాతాపితరుల దివ్యసంయోగం వల్ల ఏర్పడినది. అటువంటి మాతాపితరులను నిరంతరము సేవిస్తూ, పూజిస్తూ, తరిస్తూ, వారి మరణానంతరం శ్రాద్ధకర్మలు ఆచరిస్తూ, మాతృఋణ విముక్తుడవుతాడు మానవుడు. (2) ఋషి ఋణము. అఖండ భారతావనిలో కోటానుకోట్లమంది ఋషులు అవతరించి, వేదవేదాంగములను మనకు అందించారు. వారు అందించిన వేదవేదాంగములను అధ్యయనం చేస్తూ, ఋషిఋణ విముక్తుడౌతున్నాడు మానవుడు. (3) దేవఋణము. అఖండ భారతావనిలో త్రింశత్కోటి దేవతలు అవతరించారు. దేవతానుగ్రహము వల్లే వర్షములు పడి, ఆహారము మనకు లభిస్తూ వున్నది. నిరంతరము దేవతారాధన చేస్తూ, యజ్ఞయాగాది క్రతువులు నిర్వర్తిస్తూ, దేవఋణ విముక్తుడౌతున్నాడు మానవుడు. (4) మానవఋణము. ప్రతీ మనిషి ఎదుటిమనిషి నుండి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సహాయసహకారములను పొందుతూనే వున్నాడు. అటువంటి సాటి మానవులకు తనవంతు సహాయసహకారములను అందిస్తూ, మానవసేవయే మాధవసేవగా భావించి జీవనాన్ని కొనసాగించిన మానవుడు మానవఋణ విముక్తుడౌతున్నాడు. (5) జీవఋణము. ప్రతీ మనిషి ఎదుటిజీవి నుండి అనేకవిధములుగా సహాయసహకారములను పొందుతున్నాడు. తనను ఆశ్రయించిన జీవులను పోషిస్తూ, జీవఋణ విముక్తుడౌతున్నాడు మానవుడు. పై ఐదు అప్పులను తీర్చుకోలేని మానవుడు మరణానంతరం స్వర్గమోక్షాదులను చేరుకోలేడు.

**41. చతురాశ్రమ ధర్మాలేవి?**

**జ:** మానవుడు మోక్షసామ్రాజ్యాన్ని అధిష్ఠించాలన్న చతురాశ్రమ

ధర్మాలను ఖచ్చితంగా పాటించితీరాలి. (1) బ్రహ్మచర్య ఆశ్రమము. ఉపనయన సంస్కారానంతరం గురుకులం చేరి, బ్రహ్మచర్యదీక్ష వహించి, వేదవేదాంగములను అభ్యసించి, గురుదక్షిణ సమర్పించి, దేశాటనకు వెళ్లి, ఇంటికి తిరిగివచ్చి తల్లిదండ్రులు సూచించిన కన్యను వివాహమాడుటతో బ్రహ్మచర్య ఆశ్రమము పూర్తవుతుంది. (2) గృహస్థాశ్రమము. వివాహముతో గృహస్థాశ్రమము ప్రారంభమగును. సంతానార్థియై వివాహం చేసుకొన్న భార్యను ధర్మమార్గముగా సముపార్జన చేసిన ధనముతో పోషిస్తూ, సంతానాన్ని బడసి, వారికి విద్యాబుద్ధులు నేర్పించి, వివాహములు జరిపించి, వారు సంతానవంతులైన పిదప బాధ్యతలన్నీ పిల్లలకు అప్పగించి, అరణ్యానికేగడంతో గృహస్థాశ్రమము పూర్తగును. (3) వానప్రస్థాశ్రమము. అరణ్యానికేగిన దంపతులిరువురూ ఆధ్యాత్మిక చింతనాసక్తులై నిత్యకర్మానుష్ఠానము చేసుకొంటూ, కందమూలములు భుజిస్తూ, విరాగులై, సన్యాసి గురువుద్వారా సన్యాసాశ్రమ స్వీకారము చేయడంతో వానప్రస్థాశ్రమము పూర్తగును. (4) సన్యాసాశ్రమము. సన్యాసాశ్రమంలో భార్యాభర్తలు విడివిడిగా భిక్షాటన చేస్తూ, దేశాటన చేస్తూ, దివ్యక్షేత్రాలను సందర్శిస్తూ, చివరకు కాశీక్షేత్రానికి చేరి, విశ్వనాథుని సన్నిధానంలో ప్రాణములు పరిత్యజించుటతో సన్యాసాశ్రమము పూర్తగును. ఈవిధంగా వేదంలో చెప్పబడిన చతురాశ్రమ ధర్మాలను ఏ మానవుడైతే ఆచరిస్తాడో ఇహంలో సుఖాన్ని, పరంలో మోక్షాన్ని సాధిస్తాడు.

**42. ఏయే హోమాదులకు ఏయే ద్రవ్యములు ఉపయోగించాలి?**

**జ:** గణపతి హోమమునకు చెరుకుముక్కలు, వరిపేలాలు, బెల్లము ముక్కలు, పటికబెల్లం ముక్కలు, తేనె, కొబ్బరిముక్కలు, జీడిపప్పు, బాదం

పలుకులు, ఎండుఖర్జూరాలు, తామరపువ్వులు, తామరగింజలు, ఎండుద్రాక్ష, ఎండు కిస్‌మిస్, కుడుములు, అరటిపండ్లు, వెలగపండ్లు.

కార్తవీర్యార్జుననకు క్షీరాన్నముతో హవనము చేయాలి.

రుద్రహోమమునకు మారేడుకాయలు, మారేడుదళాలు, మారేడుసమిధలు, మేడికాయలు, మేడిదళాలు, మేడిసమిధలు, ఉసిరికాయలు, ఉసిరిదళాలు, ఉసిరిసమిధలు, జువ్విసమిధలు, నెయ్యి.

సర్పహోమాలకు: కాలసర్పదోష నివారణకు విషముష్టి విత్తనాలు, విషముష్టి చెక్క వాడతారు.

సంతానముకొరకు: సర్పదోషంవల్ల సంతానం కలగకపోతే మామిడివేరు, వ్యాఘ్రపాదం, త్రివృత్తమూలం, లక్ష్మణవేరు, ఉత్పలం, తగరం, చెంగల్వకోస్టు, యష్టిమధుకం, చందనం, మేకపాలలో ముంచి హవనం చేయాలి.

సర్పదోషంవల్ల బహిష్ఠు, అనారోగ్యాలు ఉంటే శొంఠి, మిరియాలు, పిప్పళ్ళు (త్రికటు), కరక్కాయ, తానికాయ, ఉసిరి (త్రిఫల) చిత్రమూలం, ఇంగువ, లక్ష్మణవేరు, మేకపాలలో ముంచి హవనం చేయాలి. సర్పదోషంవల్ల పక్షవాతము లేదా తీవ్రజ్వరం వుంటే చిట్టాముదపు వేరు, మామిడివేరు, తెల్లతెగవ వేరు, నీలోత్పలం, తగరం, చెంగల్వకోస్టు, యష్టిమధురం, తెల్లచందనం, లక్ష్మణవేరు, మేకపాలలో ముంచి హవనం చేయాలి. సర్పదోషంవల్ల పుంస్త్వలోపం వుంటే మంజిష్టం, అతిమధురం, చెంగల్వకోస్టు, త్రిఫల, పంచదార, ముత్తువ, పులగం, మేథ, పయస్య, కాకలీదుంప, అశ్వగంధ, అజామోద, పసుపు, ఇంగువ, పటుకరోహిణి, ఉత్పలం, కలువ, ద్రాక్ష, చందన, రక్తచందనములు కలిపి హవనం చేయాలి.

వైష్ణవ హోమాలకు క్షీరాన్నం, ఆవునెయ్యి, ఎండు కిస్‌మిస్, కొబ్బరిముక్కలు, బాదాం పలుకులు, జీడిపలుకులు హవనం చేయాలి.

దశమహావిద్యలకు దర్భ, గరిక, తెల్లఆవాలు, నవధాన్యాలు, మారేడుకాయలు, బార్లీగింజలు, తెల్లనువ్వులు, కమలబీజాలు, వరిపేలాలు, పంచామృతాలు, బెల్లం ముక్కలు, కురిడి కొబ్బరిముక్కలు, అరటిపండ్లు, హవిష్యాన్నం, లడ్లు, విప్పపువ్వు హవనం చేయాలి.

యోగినీదేవతలకు కనుక, చెరకు, తాళ, వేప, భూజ్యపత్రం, తేనె, ఏలక, లవంగ, నిమ్మ, దానిమ్మ, మండపసుపు, నల్లపసుపు, నేలములికి (నాలుగు రంగులలో తెలుపు, పసుపు, ఎరుపు, నీలం), నారింజ, జటామాసి, సంపెంగ హవనం చేయాలి.

అప్సర, కిన్నరీ హోమాలకు సైంధవలవణం, రాగి, మట్టి, మామిడి, ఉత్తరేణి, తులసి, అత్తిపత్తి, తెల్లగలిజేరు, విష్ణుక్రాంత, తెల్లమోదుగ, ఎఱ్ఱమోదుగ (తీగమోదుగ వాడకూడదు), తెల్లజిల్లేడు, తెల్లగరిక, నల్ల ఉమ్మెత్త, బ్రహ్మదండి, నక్కపీతరి గడ్డ వాడాలి.

భైరవీ భైరవుల హోమాలకు బ్రహ్మజెముడు, నాగజెముడు, రుద్రజెముడు, మొద్దుజెముడు, కొబ్బరిముక్కలు, ఊడుగ, బ్రహ్మదండివేర్లు, భస్మము, తాళకం, అభ్రకం, కిలస్తుఘ్నం, మైసాక్షి, లోభాన్, గుగ్గిలం, సాంబ్రాణి, నల్లపటిక (రాగిపటిక), నల్లనువ్వులు, మిరియాలు హవనం చేయాలి.

శక్తిహోమాలు చేసేటప్పుడు దశమహావిద్యలకు వాడే ద్రవ్యాలతోపాటు కుంకుమ కలిపిన అన్నము కూడా వాడాలి. ప్రత్యంగిరలకు తానికాయ (విభీతకి), తెల్లజిల్లేడు, చంద్ర, శొంఠి, పిప్పళ్ళు, తిప్పతీగ, మిరియాలు, నల్లనువ్వులు, వెల్లుల్లి, ఎండు మిరపకాయలు, వేపనూనె, ఆముదము,

నల్లనువ్వులనూనె, అవిసెనూనె, విప్పనూనె వాడాలి.

జ్వరనివారణకు, అపమృత్యు నివారణకు, ఆహార పాచన మంత్రాలకు, మాలామంత్రాలకు, గాయత్రీ మంత్రాలకు మిరియాలు, ఆవునెయ్యి వాడాలి.

**42. సిద్ధ విద్యలలోకెల్లా ఉత్తమమైన విద్యలు ఏది?**

**జ:** 1. లక్ష్మీనారాయణి విద్య. 2. భవానీ శంకర విద్య. 3. సీతారామ విద్య. 4. పంచభక్త హనుమన్ మహావిద్య. 5. నృసింహ అనుష్టుప్ విద్య. 6. బగళా బ్రహ్మాస్త్ర విద్య. 7. హనుమదష్టార్ణ విద్య. 8. లక్ష్మీగణపతి విద్య. 9. మహాసౌరవిద్య. 10. దక్షిణకాళికా విద్య. 11. చింతామణి మహావిద్య. 12. సామ్రాజ్య లక్ష్మీవిద్య అను 12 విద్యలు ఇష్టకామ్యార్థ సిద్ధికి అనువైనవి.

**43. సాధకునకు గురుప్రాధాన్యత ఏమిటి?**

**జ:** గురువును మించిన దైవం లేదు. గురువును మించిన తపస్సులేదు. గురుధ్యానము కన్నా మిన్నయైన ధ్యానంలేదు. గురువుకాక ఈ భూమ్మీద అధికమైనదేదీ లేదు. ధ్యానమునందు గురువుయొక్క ఆకారమే మూలమై యున్నది. పూజయందు గురుపదకమలములే ప్రధానముగా ఎంచవలెను. మంత్రములకు మూలము గురువు చెప్పిన మాటలే. గురువుయొక్క అనుగ్రహమే విద్యాసిద్ధికి మూలమని గ్రహించాలి. ఈ లోకమునందు ఏ విద్య సిద్ధించాలన్నా గురువే మూలము కాబట్టి సాధకులైనవారు తమ అభీష్టసిద్ధి నొందుటకు భక్తిగా గురుదేవుని సేవించవలసియున్నది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఆదిగాగల సకల దేవతలు, మునులు, యోగులు గురువు సంతుష్టినొందుటవల్ల సంతుష్టాంతరంగులవుతున్నారు. గురుభక్తి

లేనివాని తపస్సు, విద్య, వ్రతాచరణము, కులయోగ్యతలు మొదలగునవి నిష్ఫలమగుచున్నవి. అవి కేవలం లోకరంజన గావించుటకు మాత్రమే ఉపయోగించగలవు. గురువునందు ఈతడొక మనుష్యుడన్న భావము, మంత్రమునందు ఇవి అక్షరములను భావము, దేవతాప్రతిమ యందు ఇవి రాళ్ళు అను భావము కలవానికి విద్యాసిద్ధి లభించకపోగా నరకము నొందుట నిశ్చయము.

## 44. గురుపూజా విశేషమేమి?

**జ:** దైవపూజకంటెను గురుపూజ చాలా ముఖ్యమైనది. గురువును పూజించకుండా తన ఇష్టదైవమును పూజించకూడదు. గురువు సాన్నిధ్యమందు లేనప్పుడు మానసిక పూజ చేసియైనను ముందు గురుపూజ చేయవలెను. మొదట గురుపూజ గావింపక చేసిన పూజాజపములయొక్క శక్తిని భైరవుడు హరిస్తాడు. గృహమందు తాము దేవతాపూజ గావించు సమయంలో తన ఇంటికి గురువుగానీ, ఆయన భార్యగానీ, పుత్రుడుగానీ వచ్చినయెడల వెంటనే తాను చేయుచున్న దైవపూజను వదలివేసి, తన గురువును లేక వారి దారాపుత్రులను పూజించవలెను. దైవపూజకే సమకూర్చి ఉంచిన గంధ, పుష్ప, నైవేద్యాదులన్నింటిని గురుపూజయందు వినియోగించవలెను. చిత్తశుద్ధితో ఈ ప్రకారం ఆచరించిన యెడల తాను పూజించదలచిన దేవతలు తప్పక ప్రీతి చెందగలరు. గురువును నిష్కల్మషాంతరంగుడై, భక్తిప్రపత్తులతో సేవింపుచూ, పూజించుటవలన సమస్త మంత్రములు సిద్ధించగలవు. ఆ మంత్రాధిష్ట దేవతానుగ్రహముచే దుర్లభములైన సర్వసిద్ధులు సమకూరగలవు. గురువును, గురుపత్నిని, గురుపుత్రుని సాధకుడు తన శక్తికొలది వస్తు, వస్త్రాభరణములచే

సంతోషింప చేయవలెను.

**45. ఎటువంటి మంత్రమును ఉపదేశము తీసుకొనవలెను?**

**జ:** సప్తకోటి మహావిద్యలున్నాయి. అందు సాధకునకు ఏ మంత్రము తక్షణసిద్ధి నీయగలదో ఏ మంత్రము చిరకాలమువరకు ఫలించునో, ఏ మంత్రము ప్రతికూలమై, కష్టనష్టములను కలిగించునో, ఏ మంత్రము ఎల్లరును అనుష్ఠించుటకు యోగ్యమై యుండునో తెలుసుకొని మంత్రోపదేశము ఈయవలెను. తీసుకొనవలెను. సూర్యగ్రహణ సమయమందు చంద్రగ్రహణ కాలమందు, అర్ధోదయమందు, మహోదయము నందు, గొప్ప పర్వము సంభవించిన కాలమందు, గురువుచే నొసంగబడు మంత్రమునకు సిద్ధారిశోధన చేయనవసరంలేదు. ఎవరైనను స్వప్నమందు ఉపదేశించిన మంత్రమునకు, దైవికముగా లభించిన మంత్రమునకు, అదేవిధంగా స్త్రీలచేత నొసంగబడినదానికి, గురువు అనుగ్రహించి ప్రసాదించిన మంత్రమునకు, పితృదత్తమైన, మాతృదత్తములైన మంత్రములకు, సిద్ధారిశోధన అవసరములేదు. పీఠత్రయ మంత్రమునకు కామగిరిపీఠము, పూర్ణగిరి పీఠము, జాలంధర పీఠము, ఈ మంత్రములు బ్రహ్మ, విష్ణు, రుద్రశక్త్యాంశలు గలవి. ఐదువిధములైన ప్రణవములకు సపిండ్యాక్షరములకు, నృసింహ, వరాహ, వాసుదేవ, వైష్ణవ మంత్రములకు, ఒకటే అక్షరముతో కూడిన మంత్రములకు, మూడు అక్షరములు గలదానికి, గోపాల, వామన, రామ, భాస్కర, సుదర్శన మంత్రములకు, నామత్రయ మంత్రములకు, వాసుదేవ, అనిరుద్ధ, సంకర్షణ మంత్రములకు, కార్తవీర్యార్జున మంత్రములకు, కార్యవతీ మంత్రములకు, ఆంజనేయ, హయగ్రీవ, దక్షిణామూర్తి, చింతామణి,

గణపతి మంత్రములకు, బాల, పంచదశీ, షోడశీ, శివతారక, నారాయణ మంత్రములకు, ప్రణవము మొదటను, స్వాహా చివరనుగల మంత్రములకు, సాధువు, యోగులు మొదలగువారు అనుగ్రహ పూర్వకంగా ప్రసాదించిన మంత్రములకు, గాయత్రికి, వేదమునందలి మంత్రములకు, సర్ప, గరుడమంత్రములకు, వాక్యములుగా ఉన్న మంత్రములకు, శాంభర మంత్రములకు, పంజర, కవచ, మాలా మంత్రములకు, సిద్ధారి శోధనము చూడనవసరంలేదు.

అదేవిధంగా కులాకుల చక్రశోధనము కూడా చేయవలయును. సాధకుని నామమునందలి మొదటి అక్షరము, అదేవిధంగా మంత్రమునందలి మొదటి అక్షరము ఒకటే అయిన యెడల అవి ఏక కులమునకు చెందినవిగా గ్రహించవలెను. అట్లు కాక భేదించిన యెడల శత్రుమిత్రత్వములను తెలుసుకొనవలెను. కులాకుల చక్రమును బట్టి భూమి, జలము, వాయువు, ఆకాశము, అగ్ని అనునవి పంచభూతములు. ఈ పంచభూతములకు చెందినవే అకారాది, క్షకారాంతములైన అక్షరములు. ఏ అక్షరములు ఏ భూతమునకు చెందినవో గ్రహించి తన నామ ప్రథమాక్షర భూతమునకు, మంత్ర ప్రథమాక్షర భూతమునకు వైరము లేనట్లుగా చూచుకొనవలెను. జలభూమి భూతములు మిత్రములు. అగ్ని, వాయువు మిత్రములు. వాయు–భూమి, అగ్ని–జలములు శత్రువులు. ఆకాశము మిగిలిన నాలుగు భూతములతో మిత్రత్వము కలిగియుండగలదు. సాధకుని నామ ప్రథమాక్షరము మంత్రముయొక్క ప్రథమాక్షరము ఒకే భూతమునకు చెందినవైనను, మిత్రభూతములకు చెందినవైనను శుభప్రదము. శత్రుభూతాక్షరములు కీడు కలిగించగలవు.

సిద్ధారిచక్రము దగ్గర ఉంచుకొని, సాధకుని నామాక్షరము మొదటి ఏ గడిలో ఉన్నదో ఆ గడినుండి మంత్ర ప్రథమాక్షరము ఉన్న గడివరకు లెక్కించగా వచ్చిన సంఖ్యను 4చే భాగించగా శేషము ఒకటియైన సిద్ధము. 2 అయిన సాధ్యము. 3 అయిన సుసిద్ధము. 0 అయిన శత్రువు అని తెలియవలెను. సిద్ధారిచక్రము నందలి అక్షరములను పైవిధంగా లెక్కించిన పిమ్మట సాధకుని నామ ప్రథమాక్షరము గల కోష్టము సిద్ధకోష్టముగాను, అటుపిమ్మట వరుసగా సాధ్య, సిద్ధ, అరి కోష్టములుగా చెప్పబడినవి. ఇది మంతాంతరమైనను బహుజనాచరణీయముగా ఉన్నది. సిద్ధకోష్టమునందలి నాలుగు గడులలోనూ, సాధకనామ ప్రథమాక్షరము ఉన్న గడి సిద్ధసిద్ధము. దాని తర్వాత వరుసగా గల గడులు సిద్ధ, సాధ్యము. సిద్ధ, సుసిద్ధము, సిద్ధారి అని గ్రహించదగియున్నది. సిద్ధకోష్టమునందలి అక్షరములు మొదటగల మంత్రములు కొంతకాలమైన పిమ్మట సాధ్యకోష్ట మంత్రములు జప, హోమాదులవల్లను, సుసిద్ధ కోష్ట మంత్రము గ్రహించినంత మాత్రముచేతను, ఫలవంతములు కాగలవు. అరికోష్టమంత్రము వంశమును మూలసహితముగా నశింపచేయగలదు. సిద్ధకోష్ట మంత్రములు బంధువులవలె ఉండగలవు. సాధ్యకోష్ట మంత్రములు సేవకులవలె ఉండగలవు. సుసిద్ధకోష్ట మంత్రములు సాధకుని అభీష్టమును పోషించి, శీఘ్రఫల సిద్ధిని నొసంగగలవు. అరికోష్టమునందలి మంత్రములు నిశ్చయముగా నాశనమొనర్చగలవు. సిద్ధసిద్ధమగు మంత్రము కల్పమునందు తెలుపబడిన విధంగా జపించుటవలన సిద్ధించగలదు. సిద్ధ సాధ్య మంత్రము తెలుపబడిన సంఖ్యకంటే రెండింతలుగా జపించుటవలన ఫలసిద్ధి నొందగలదు. సిద్ధ, సుసిద్ధ మంత్రము చెప్పియున్న సంఖ్యయందు

సగము జపించుటవల్ల సిద్ధించగలదు. సిద్ధారి మంత్రము బంధువులను చంపగలదు. సాధ్య, సిద్ధ మంత్రము రెండింతలు జపించుటవల్ల సిద్ధించగలదు. సాధ్యసాధ్య మంత్రము ఎంత జపించినప్పటికీ నిరర్థకము కాగలదు. సాధ్య, సుసిద్ధ మంత్రము మూడింతలు జపించుటవల్ల ఫలము కలుగును. సాధ్యారి మంత్రము జపించుటవలన తన వంశమువారికి కీడు సంభవించగలదు. సుసిద్ధ మంత్రము తెలుపబడిన సంఖ్యయందలి సగము జపించుటచేతనే సిద్ధించగలదు. సుసిద్ధ, సాధ్యము రెండింతలు జపము చేతను, సుసిద్ధ, సుసిద్ధము మంత్రము ఉపదేశము నందినంత మాత్రముచేతను సిద్ధించగలవు. సుసిద్ధారి మంత్రము తన గోత్రమువారికి, దాయాదులకు హాని చేయగలవు. అరిసిద్ధ మంత్రము పుత్రులకు కీడు చేయగలదు. అరిసాధ్య మంత్రము పుత్రికలకు హానిదాయకము. అరి సుసిద్ధ మంత్రము భార్యను చంపగలదు. అరి అరి మంత్రము సాధకునే చంపగలదు. సిద్ధారి చక్రమునందు మంత్రము దూషితమైయున్న యెడల ఆ మంత్రమునకు మొదట హ్రీం అను అక్షరమునుగానీ, క్లీం అను దానినిగానీ, శ్రీం అను బీజమును గాని చేర్చి జపించిన దోషము పరిహారము కాగలదు.

ఇదేవిధంగా ఋణ, ధన, శోధనము చేయవలసియున్నది. కులాకుల చక్రము, సిద్ధారి చక్రముల రీత్యా మంత్రము యోగ్యమైనదిగా నిర్ణయించిన పిమ్మట ఋణ, ధన, శోధన జరుపవలసి యున్నది.

**46. మంత్రోపదేశమునకు యోగప్రదమైన కాలమేది?**

**జ:** యోగ్యము కాని దినములయందైనను, గ్రహణము కలిగిన సమయము తటస్థించిన ఆ సమయంలో మంత్రోపదేశము శుభప్రదము.

సూర్యగ్రహణ సమయమును మించిన యోగ్యమైన సమయము ఈ భూమి యందు మరొకటి యుండదు. ఈ సమయమునందు ఆచరించిన సర్వకర్మలు అనంతఫలదాయకా లవుతాయి. రవి సంక్రమణము అనగా సూర్యుడు ఏదైనను రాశియందు ప్రవేశించుకాలము. వీనిలో మకర, కర్కాటక రాశులు చాలా యోగ్యమైనటువంటివి. పుణ్యప్రదములైన అరణ్యములు, వనములు, తీర్థములు, కురుక్షేత్రము, దేవీపీఠములు, ప్రయాగ, శ్రీశైలము, కాశీక్షేత్రము వీనియందు కాలము గురించి విచారించకనే మంత్రోపదేశము నొందవచ్చును. శరదృతువు ప్రారంభము తొమ్మిది దినములందు అనగా దేవీ నవరాత్రులలో, కార్తీక శుద్ధ ఏకాదశి యందు, చైత్రశుద్ధ అష్టమి అనగా అశోకాష్టమినందు, శ్రీరామనవమి దినములందు కాలము యోగ్యమగునా లేదా అని ఆలోచించకనే మంత్రదీక్ష నొందవచ్చు. గురువు శిష్యునియందుగల వాత్సల్యమువలన కృపతో పిలిచి మంత్రోపదేశమిచ్చినపుడు, లగ్నాది, యోగ్యాయోగ్యములను విచారించ వలసిన పనిలేదు. గురువు సంతసించిన దినమందు గ్రహ, నక్షత్ర, రాశ్యాత్మకమైన కాలము శుభప్రదమై యుండగలదు. గురువు సంతోషము చెందుటవల్ల సర్వదేవతలు, సంతోషపడగలరు. కావున ప్రయత్న పూర్వకంగా గురుదేవుని సంతోషపెట్టుట సాధకునికి అవశ్యకర్తవ్యము.

**47. ఎవరెవరికి మంత్రోపదేశము ఇవ్వరాదు?**

**జ:** అశాస్త్రీయమగు పద్ధతులద్వారా మంత్రము ఉపదేశించువాడు, అట్టి పద్ధతులద్వారా మంత్రమును ఉపదేశము పొందువాడు, అనగా గురుశిష్యు లిరువురు కూడా ఇరువదియొక్క నరకములందు పడగలరు. కావున శిష్యుడు గురువుయొక్క యోగ్యత, గురువు శిష్యునియొక్క యోగ్యత

పరీక్షించిన పిమ్మట ఉపదేశమునకు సిద్ధమగుట ముఖ్యము. తల్లి తండ్రి, మేనమామ, తమ్ముడు, శత్రుపక్షము నందున్నవారి వలన ఎన్నటికీ మంత్రోపదేశము నొందకూడదు. యతులు, పితృసమానులు, వనవాస మొనర్చువారు, ఒక ఆశ్రమమంటూ లేకుండువారు మంత్రోపదేశ మిచ్చుటకు అనర్హులు. వారిచ్చిన మంత్రములు శుభప్రదము కాజాలవు. భర్త భార్యకు, తండ్రి తన కొడుకులు, కూతుళ్లకు, అన్న తమ్మునికి మంత్రోపదేశము చేయకూడదు. స్త్రీలు, శూద్రులు మంచిచెడ్డలు బోధించిన వినవచ్చునుగానీ, వారిచే మంత్రోపదేశమునొందుట నిషేధము. యోగ్యుడైన గురువును ఏ కారణంచేత కూడా త్యజించకూడదు. అట్లు చేసిన మృత్యువు కలుగును. మంత్రము కారణములేకుండా వదలివేయకూడదు. మంత్రత్యాగి దరిద్రుడు కాగలడు. గురుమంత్రములను విడిచినవాడు రౌరవనరకము నొందగలడు. గురువు కారణాంతరములచే లక్షణహీనుడైన అనగా మిథ్యావాదము, బడాయి, మొ॥ దుర్లక్షణములు కలిగినవాడైన యెడల అట్టి గురువును వదలివేయవచ్చు. గురువు కారణాంరతములచే మహాపాపి యైనను, దోషముగలవాడైనను, దైవనింద యొనర్చి నాస్తికుడైనను, అట్టి గురువుచే నీయబడిన మంత్రమును పరిత్యజింపవలెను.

**48. శిష్యునియొక్క లక్షణము ఏవిధంగా ఉండవలెను?**

**జ:** పరిశుద్ధమైన అంతరంగముతో కూడి, వినీతుడై, శాంతస్వభావము కలిగి, భక్తిశ్రద్ధాసమన్వితుడై, కార్యశీలత, సమర్థత్వము, ప్రాజ్ఞత్వము, సచ్ఛరిత్ర, క్షమ, దయాది సద్గుణములు కలిగి, కులీనత్వము, వినయ వివేకములు, ధనసమృద్ధి మొ॥ లక్షణములు కలిగియున్నవాడు శిష్యుడుగా నుండుటకు యోగ్యుడు. శిష్యుడు క్షేత్రము వంటివాడు. గురువు కర్షకుడు.

మంత్రము బీజము. కావున కర్షకుని కష్టమునకు బీజవిన్యాసము యొక్క సార్థకతకు ప్రధానమైనది యోగ్యమైన క్షేత్రము. కాబట్టి యోగ్యుడైన శిష్యుడు లభించుట చాలా దుర్లభము. ప్రతీవాడు మంత్రోపదేశమునకు అర్హుడు కానేరడు. విద్యయందలి వ్యామోహము కన్నను, గురుభక్తి, దయాపరత్వము, పరోపకారపారాయణత, జాలి, కరుణ, మొ॥ గుణములున్నవాడే మంత్రోపదేశము నొందుటకు యోగ్యుడు.

**49. సాధకుడు ఏ లక్షణములతో ఉండాలి?**

**జ:** సత్కర్మలను నిత్యమూ ఆచరించువాడు, ధర్మాధర్మములు తెలిసినవాడు. యోగాభ్యాస మొనర్చి, అందలి మెలకువలు గ్రహించినవాడు, అన్నిటియందు సమమైన బుద్ధిగలవాడు, శాస్త్రములయందు నిష్ణాతుడు, క్షమ, కృప కలిగియున్నవాడు, మెల్లగా మాట్లాడువాడు, మంచి వాక్కులు కలిగి, చూచుటకు సౌమ్యముగా కనిపించువాడు, నిద్రను జయించి, పనుల యందు నేర్పు కలిగినవాడు, శాంతమైన స్వభావము కలిగి, ఇతరులను సంతోషపరచువాడు, సాధకుడైయున్న విశిష్టత్వము చేకూరును. అనగా పై గుణములన్నియు మంత్ర, యంత్ర, తంత్రములను సాధించువానికి ఉండవలెను. గురువు శిష్యుని, శిష్యుడు గురువును తప్పక పరీక్షించుకొనవలెను. ఏ కారణంచేతనైనా వారిరువురు ఒకరినొకరు పరీక్షించుకొనక, ఉపదేశమిచ్చుట, పుచ్చుకొనుట జరిగినయెడల ఆ గురుశిష్యులిరువురు పిశాచత్వము నొందగలరు.

**50. మంత్రసాధనకు దీక్షాప్రాధాన్యత ఏవిధంగా చెప్పబడింది?**

**జ:** జపములకు మూలమైన ఆశ్రమము దీక్ష. తపమునకు దీక్షయే మూలము. ఏ ఆశ్రమమునందున్నను వానికి సంబంధించిన దీక్షను

ఆశ్రయించియే ఉండవలెను. కావున దీక్ష చాలా ప్రధానమైనది. దీక్ష లేకుండా ఆచరించిన జప, పూజాది కర్మలన్నియు రాళ్లమీద జల్లిన గింజలు మొలకెత్తనట్లు ఫలించవు. దీక్షలేనివానికి సిద్ధిలేదు. సద్గతియూ ఉండవు. కావున తాంత్రిక, వైదిక కర్మలయందు విధిగా గురువుద్వారా దీక్షను గైకొనవలెను. అనేక కల్పములుగా రచించబడిన పుస్తకములందు చూచి, దీక్షారహితుడై, మంత్రముల ననుష్ఠించువాడు, నరాధముడై వేయి మన్వంతరముల కాలమువరకు విద్యా, జ్ఞానహీనుడై, నిష్కృతిలేక పుట్టుచుండును. సద్గురువు ద్వారా పొందబడిన దీక్ష సర్వకర్మలకూ సాధనభూతము కాగలదు.

**51. షట్కర్మలనగా ఏవి?**

**జ:** వశ్యము, ఆకర్షణము, స్తంభనము, విద్వేషణము, ఉచ్చాటనము, మారణము అనునవి షట్కర్మలు. మానవులు ముఖ్యంగా వీనిద్వారానే సాధనయందు తమ అభీష్టములను నెరవేర్చుకొందురు. మోహనము, శాంతికము, పౌష్టికము, సిద్ధ్యము, అను నాలుగు ఉపావస్థలు వశ్యకర్మ యందు ఉంటాయి. క్షోభణము, జృంభణము, ఆతురము, పీడనము అను నాలుగు అవస్థలు ఆకర్షణకరములయందు ప్రాప్తిస్తాయి. దీపనము, ముగ్ధము, మూఢము, నిశ్చలము అను నాలుగు విధములైన అవస్థలు స్తంభనకర్మయందు ప్రాప్తించును. ఉద్రేకము, ఆవేశము, ప్రతీకారము, ప్రభంజను అను అవస్థలు విద్వేషకర్మలు సాధించునపుడు కలుగుచుండును. చంచలము, చపలము, గమాగమము, భయము అను నాలుగు అవస్థలు ఉచ్చాటన కర్మయందు కలుగుచుండును. ఉన్మాదము అను అవస్థ కూడా సంభవించుట కలదు. దేహదారుఢ్యము, పురుషత్వము, అపస్మారము,

మరణము అను నాలుగు అవస్థలు మారణకర్మయందు ఎల్లప్పుడు సంభవించుచుండును. ఈ ఇరువది నాలుగు ఉపావస్థలు ఆయా కర్మలందు వాటి వాటి పేర్లకు తగినవిధంగా ప్రధాన కర్మయొక్క బలమునుసరించి ఫలితములు నొసగును.

ముందుగా దీక్షాస్వీకారము గావించి, తదుపరి తాను సాధింపవలసిన కార్యమును గురించి దృఢమైన సంకల్పము గావించవలెను. తదుపరి విఘ్ననాశనుడు గణేశుని గురువందన పూర్వకముగా పూజించి, పిమ్మట ఈ సృష్టికి ఆధారభూతమైన శక్తిని ప్రార్థించవలెను. ఆ తర్వాత తన కులదేవతలను పూజించి, తనయొక్క రక్షణకొరకు దిగ్బంధనము గావించుకొని, ఆ తర్వాత మంత్ర, యంత్ర, తంత్రాది కర్మలను సాధించుటకు ఉపక్రమించవలెను. సాధకుడు తానొక్కడే అన్నిపనులు చేసుకొనుచూ సాధించు కర్మ ఉత్తమమనబడి, సిద్ధిదాయకము కాగలదు. తనతోపాటు మరొకరిని సహాయముగా నుంచుకొని సాధించుట మధ్యమము. అట్లుకాక మందితోకూడి ఈ విద్యాసాధన చేయుట కూడదు. విపత్తులు సంభవించగలవు.

జీవులు తాము చేసిన కర్మలయొక్క ఫలితములనే తిరిగి ఈ జన్మయందు అనుభవించుచుండెదరు. ఎవరికి ఏ కర్మఫలితము, ఏ రూపంగా అనుభవమునకు వచ్చునో నిర్ణయించునది అమ్మే. మానవుల ఇష్టాయిష్టముల అనుసరించి, వారికి సంభవించు సుఖదుఃఖములు ఏర్పడవు. పరమేశ్వరుడు వారి వారి కర్మలను కాలమునందలి క్రియా విశేషములద్వారా ముందుగా సూచించగలడు. అందువలన సాధకుడు కాలముయొక్క చేష్టలను అనగా శకునములను గమనించి, అవి

శుభదాయకముగా ఉన్నప్పుడే సాధనకు ఉపక్రమించవలెను. లేనిచో కష్టములు ప్రాప్తించగలవు.

**52. షట్పల్లవములు అనగా ఏమి?**

**జ:** సాధనయందు షట్పల్లవములు అనునవి చాలా ముఖ్యమై ఉన్నాయి. ప్రధాన మంత్రములకు షట్పల్లవ ప్రయోగము, అష్టప్రయోగము, సర్వ సామాన్యమై ఉన్నవి. పల్లవములు, వాటి ప్రయోగములు అనేకములుగా ఉన్నాయి. నమః, వషట్, ఖేఖే, హుం, వౌషట్, ఫట్ అనునవి షట్పల్లవములు. వీటిని ఆరువిధములైన కర్మలయందు ఉపయోగించుటవల్ల కలుగు ఫలాన్ని తెలుసుకుందాం.

నమః అను పల్లవము సంపదకొరకు సాధించు కర్మయందు, వషట్ అను పల్లవము వశ్యకరములయందు, వౌషట్ అను పల్లవము ఆకర్షణ కరములయందు, హుం అను పల్లవము విద్వేషణకర్మలందు, ఫట్ అను పల్లవము ఉచ్చాటన కర్మయందు, ఖేఖే అను పల్లవము మారణకర్మలయందు, స్వాహా అనునది పల్లవాగ్రములకు చేర్చిన పుష్టిదాయకము కాగలదు. ఆయా కర్మలు సాధించునపుడు కర్మ విశేషము అనుసరించి ఈ పల్లవములు మంత్రమునందు ఆది మధ్యాంతరములలో సంధించుటవలన కార్యసిద్ధి శీఘ్రము కాగలదు.

ఈ షట్కర్మలకు పల్లవములతోపాటుగా ప్రతీ కర్మకు ఆ కర్మాధిష్ఠానమైన దేవతలు కలరు. వశ్యకర్మకు సరస్వతి, ఆకర్షణ కర్మకు రతీదేవి, స్తంభన కర్మకు లక్ష్మీదేవి, విద్వేషణ కర్మకు జ్యేష్ఠాదేవి, ఉచ్చాటన కర్మకు దుర్గాదేవి, మారణకర్మకు కాళికాదేవి అధిదేవతలుగా పేర్కొనబడ్డారు. మంత్రమునందు, యంత్రమునందు, తంత్రమునందు తదదిష్ఠితమైన శక్తిని గూర్చి, కర్మలను

సాధించవలెను. అదియునుగాక! కర్మ ప్రారంభమునందు ఆ కర్మకు సంబంధించిన శక్తిని పూజించుట చాలా ముఖ్యము.

వశ్యకర్మలయందు పల్లవమునకు ముందుగాను, ఆకర్షణ కర్మయందు పల్లవములకు తరువాత, స్తంభనకర్మయందు బీజాక్షరము తర్వాత, విద్వేషణ కర్మయందు బీజాక్షరమునకు ముందుగాను, ఉచ్చాటన కర్మయందు మంత్రగర్భము నందు, మారణకర్మయందు మంత్రములకు మొదట, మధ్య, చివరలయందు ఆయా కర్మల అధిదేవతలను సంపుటి చేయవలెనని తెలుసుకొనవలెను.

ఏకాక్షరీ మంత్రము, రెండక్షరములుగల మంత్రము, మూడక్షరములు గల మంత్రము, పల్లవములు, అధిదేవతలను సంపుటి చేయకపోయినను సిద్ధించగలవు. సాధనయందు పల్లవము ప్రాణము వంటిది. అదిదైవత జీవము వంటిది. కావున ప్రాణజీవసహితముగా మంత్రవేత్తలు సాధన చేయవలెను. సాధించవలసిన కార్యమును వాక్కాయ కర్మలచేత, మనోబుద్ధులచేత భావన చేయుచూ సాధన మొనర్చుట వాసన యనబడును. ఇది అన్నివేళలయందు, అన్నికార్యములందు శీఘ్రసిద్ధిని ఒసంగుటకు తోడ్పడగలదు. సాధ్య వ్యక్తియొక్క నామమును, అతని తల్లిపేరుతో సహా గోత్రయుక్తముగా మంత్రగర్భమునందు చేర్చి, పల్లవములతో కూడా మూలమంత్రము జపించుటవల్ల బ్రహ్మదేవుడే అడ్డుపడినను సిద్ధి కలుగుట నిశ్చయము. సాధ్య వ్యక్తియొక్క కంఠమును మంత్రదేవత పాశముచే బంధించి, అంకుశముచేత అతని శిరముపై పొడుచుచున్నట్లుగా ధ్యానము గావింపుచూ, జపము చేసినయెడల ఖచ్చితముగా సిద్ధి కలుగును. ఎట్టి కార్యమైనను ఫలప్రదము కాగలదు. వశ్యాది ఆరు కర్మలను, వాటికి

తెలుపబడిన ఋతుకాలము ననుసరించి కొనసాగించిన యెడల ఆటంకములు లేకుండా ఫలప్రాప్తి చేకూరగలదు.

**52. షట్కర్మలను ఏయే ఋతుకాలాలలో ఆచరించవలెను?**

**జ:** వసంతఋతువు, గ్రీష్మఋతువు, వర్షఋతువు, శరదృతువు, హేమంతఋతువు, శిశిరఋతువు అనునవి ప్రతిదినము సూర్యోదయ కాలమునుండి క్రమముగా వర్తింపచుండగలవు. ఒక దినమునకు 24 గంటలు. ఋతువులు ఆరు కనుక సూర్యోదయము 6 గంటలు అయినయెడల అచటినుండి నాలుగు గంటలకాలము అనగా ఉదయం 10 గంటలవరకు వసంతకాలము, 10 నుండి మధ్యాహ్నం 2 గంటలవరకు గ్రీష్మఋతుకాలము. 2నుండి సాయంత్రం 6 వరకు వర్షఋతుకాలము. 6 నుండి 10 వరకు శిశిరఋతుకాలము. 10 నుండి 2 వరకు శరదృతు కాలము. 2 నుండి 6 వరకు హేమంతఋతుకాలము.

ప్రతిమాసమునందు శు.పాడ్యమి మొదలుకొని ఐదు రోజులు ఒక ఋతువుగా తెలుసుకొనవలెను. శుక్ల పాడ్యమి, విదియ, తదియ, చవితి పంచములు వసంతఋతువునకు చెందినవి. షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమిలు గ్రీష్మఋతువుకు చెందినవి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, పూర్ణిమలు వర్షఋతువుకు చెందినవి. కృష్ణపక్ష పాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమిలు శిశిరఋతువుకు సంబంధించినవి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమిలు హేమంతఋతువుకు సంబంధించినవి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, అమావాస్యలు శరదృతువుకు సంబంధించినవి.

ఒక సంవత్సరమునకు గల 12 మాసములలో చైత్ర, వైశాఖ మాసములు

వసంతఋతువుగాను, జ్యేష్ఠ, ఆషాఢ మాసములు గ్రీష్మఋతువుగాను, శ్రావణ, భాద్రపద మాసములు వర్షఋతువుగాను, ఆశ్వీజ, కార్తికములు శరదృతువుగాను, మార్గశిర, పుష్యమిలు హేమంతఋతువుగాను, మాఘ, ఫాల్గున మాసములు శిశిరఋతువుగాను పరిగణించవలెను.

వసంతఋతు కాలమునందు వశ్య, మోహన, శాంతి కర్మలను, హేమంత ఋతుకాలమందు ఆకర్షణ కర్మలను, శిశిరఋతుకాలమందు స్తంభనకర్మలను, గ్రీష్మఋతు కాలమందు విద్వేషణ కర్మలను, వర్షఋతు కాలమందు ఉచ్చాటన కర్మలను, శరదృతు కాలమునందు మారణకర్మలను అన్ని ఋతుకాలములందునూ మోక్షసంబంధిత కర్మలను సాధన చేయుట విధింపబడినది.

దేశోపద్రవాది విషమపరిస్థితులు సంభవించినపుడు శత్రు, రాజ, రోగ, గ్రహాదికృతమైన సంకటములు ప్రాప్తించినపుడు ప్రాణాపాయ పరిస్థితులు కలిగినపుడు ఈ తెలుపబడిన ఋతుకాలములను పాటించనవసరం లేదు. ఏ దినమందైనను ఆ దినమునందలి షట్కర్మోచిత కాలములందు ఆయా కర్మలను సాధించవచ్చు. శ్రీవిద్యా స్వరూపిణియైన శ్రీబాలాంబికాదేవిని సాక్షాత్కరింపచేసుకొనిన సాధకునికి ఈ ఋతుకాల పల్లవాదులతో పనిలేదు. అతడు స్మరించినంతమాత్రమునకే సకలములు సిద్ధించగలవు.

**53. ఏయే కర్మలకు ఏయే రంగు వస్త్రములు ధరించవలెను.**

**జ:** శాంతికర్మలు, పుష్టికర్మలకు సాధకుడు తెలుపురంగు వస్త్రములు ధరించవలెను. ఆకర్షణయందు కూడా తెలుపురంగు ప్రశస్తము. స్తంభన కర్మలయందు పసుపు వర్ణము, విద్వేషణమునందు ముదురు ఎరుపురంగు, ఉచ్చాటన యందు ధూమ్రవర్ణము, మారణకర్మలయందు నలుపు రంగు

వస్త్రములు ధరించి సాధకుడు క్రియావిశేషణములు సాధించవలెను.

**54. పూజా, జప, స్తోత్ర, ధ్యానాదులు ఏయే ఆసనములపై కూర్చొని చేసిన ఏయే ఫలములు ప్రాప్తించును?**

**జ:** తెలుపురంగుగల ఆసనముపై కూర్చొని జపము చేయుట ప్రశస్తము. ఎరుపురంగుగల ఆసనమునందు జపమొనర్చుటవలన మంత్రదేవత స్వాధీనపడగలదు. నిత్యమూ ఆచరించు జపమునందు పద్మాసనము యోగ్యమై, శాంతిని, మంత్రవశ్యము గావించగలదు. వస్త్రముపై కూర్చుండి జపమొనర్చుటవల్ల దరిద్రము ప్రాప్తించగలదు. రాతిపై కూర్చొని జపించుటవల్ల రోగము కలుగును. భూమిపై కూర్చొని జపించుటవల్ల దుఃఖము కలుగును. చెక్కపై కూర్చొండుటవలన ఫలము శూన్యమగును. కృష్ణాజినము, దర్భాసనము జ్ఞానప్రాప్తి కలుగును. పులితోలుపై కూర్చొనిన మోక్షము, సంపదలు కలుగును. కంబళిపై కూర్చొని జపము చేయుటవలన సర్వసిద్ధులూ లభించగలవు. దర్భాసనము జ్ఞానకారమే కాక మంత్రసిద్ధిని కూడా ప్రసాదించగలవు. గడ్డియందు కూర్చొని జపించుటవలన కీర్తికి హాని సంభవించగలదు. చిగురుటాకులపై కూర్చొని జపమొనర్చిన చిత్తవైకల్యము ప్రాప్తించగలదు. ఆకుపచ్చని ఆసనమును మోహనకర్మలయందు ఉపయోగించవలెను. ఇతరులను హింసించు కర్మలయందు నల్లని ఆసనము, దేశమునకు, వ్యక్తులకు శాంతిని గూర్చు కర్మల యందు తెల్లని ఆసనము, రాజ, స్త్రీ, జనాది వశీకరణమునందు ఎరుపురంగు ఆసనమును ఉపయోగించవలెను.

**55. ఏయే కర్మలకు ఏయే ఆసనములు వేసి జపించవలెను?**

**జ:** పుష్టిని కూర్చు కర్మలయందు పద్మాసనము యోగ్యమైనది, శాంతిని గూర్చు సాధనయందు స్వస్తికాసనము ముఖ్యమైనది. వశ్యకర్మలయందు భద్రాసనము, ఆకర్షణయందు సుఖాసనము, స్తంభనకరములయందు వీరాసనము, విద్వేషణ కర్మలయందు కుక్కుటాసనము, ఉచ్చాటనయందు అర్ధ స్వస్తికాసనము, మారణకర్మలయందు వికటాసనము ప్రశస్తములై ఉన్నవి.

వశీకరణ విద్యలందు శీఘ్రఫలసిద్ధి కొరకు కప్పచర్మమును ఆసనముగా ఉపయోగించవలెను. ఆకర్షణమునందు పులిచర్మమును, స్తంభనయందు ఏనుగు చర్మమును, విద్వేషణమునందు గుఱ్ఱపు చర్మమును, ఉచ్చాటనము నందు ఒంటె చర్మమును, మారణకర్మలందు గేదె చర్మమును ఆసనములుగా ఉపయోగించిన ఫలము త్వరితంగా చేకూరగలదు. మోక్షవిద్యయందు కృష్ణాజినము శ్రేష్ఠము. ఇతరములైన అన్ని సాధనలందు దర్భాసనము ప్రశస్తమైనది.

పైన తెలుపబడిన మృగచర్మములు పురుషమృగచర్మములై ఉండవలెను. స్త్రీ మృగచర్మము మారణకర్మయందు మాత్రమే ముఖ్యముగా ఉపయోగించవలెను.

**56. జపము ఏయే స్థానములలో చేసిన ఏయే ఫలములు లభించును?**

**జ:** ప్రతిఫలము కోరు చేయు జపములకు యోగ్యమైన స్థానములు సముద్రతీరము, నదీతీరము, శివ, వైష్ణవ శక్తి ఆలయములు, గోశాల, మఱ్ఱి, ఉసిరిక చెట్లయొక్క మూలప్రదేశము, సన్న్యాసులు వసించెడు మఠములు, తులసి వనము, నిర్మలము, పవిత్రమునగు ప్రదేశములయందు

